ఓమ్ పరబ్రహ్మణే నమః.

శ్రీకృష్ణ యజుర్వేదే ఏకాగ్నికాణ్డే ప్రథమ ప్రపాఠకః

స్మార్తబాలానామత్యంతోపకారాయ

శ్రీ హరదత్తాచార్య భాష్యానుసారేణ

# వివాహోపనయనాది
# మంత్రప్రశ్నార్థప్రకాశిక.

ఆంధ్ర- పద- టీకా తాత్పర్య విరచితః

అయమ్


మచిలీపట్టణ వాస్తవ్యేన

చల్లా లక్ష్మీనృసింహ శాస్త్రి పుత్రేణ

సుబ్బరాయ శాస్త్రిణా



స్వకీయశ్రీ

లక్ష్మీనృసింహ ముద్రాక్షరశాలాయాం

ద్వితీయవారం ముద్రాపితో విజయతేతరామ్

హూణశక వత్సరాః 1960.

ముద్రాపిత గ్రంథసంఖ్యా 5000

ఏతత్ గ్రంథమూల్యం రు. 5-0-0




(పోస్టుఖర్చులు ప్రత్యేకము)

# పీఠిక.

ద్విజులకు నీ ప్రపంచంబున నుత్తమంబగు మానవ జన్మము నొంది ధర్మార్థ కామమోక్షములనియెడు పురుషార్థ చతుష్టయమును సాధింపకున్న నంతకంటె నధమజన్మ మెద్దికలదు ? చతుర్థ పురుషార్థ మన్నిటికన్న నుత్తమంబయ్యు; త్రివర్గసంపదలేక యద్దానినిఁ బడయఁ జాలము. పురుషార్థములలో మొదటిదగు ధర్మము, అన్నింటికి బ్రధానము. అట్టి ధర్మము ఆశ్రమ ధర్మము, వర్ణధర్మము, జాతిధర్మము, కులధర్మమని యనేకవిధంబులు, శాస్త్రములయందు వివరింపఁబడినది. ప్రతి మానవునకును ధర్మము ప్రధానము. ధర్మము విడనాడినచో, మానవునకును, పశువునకునుగల భేదమేమి ? శ్లో॥ ధర్మోరక్షతి రక్షితః, ధర్మమును రక్షించు కొనిన వానిని, ఆ ధర్మమే కాపాడును. శ్లో॥ ఏకఏవ సుహృద్ధర్మో గచ్ఛంత మనుగచ్ఛతి ॥ ధర్మమను మిత్రుడొకఁడే. పరలోకమునకు పోవువాని వెంటనంటివచ్చును. స్వధర్మానుష్ఠానముగావింప వలయునన్న నేదో నొకయాశ్రమముముండి తీరవలయు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములను, నాలుగాశ్రమములలో గృహస్థాశ్రమం బుత్తమంబనియు, తక్కిన మూడాశ్రమంబులవారికి నీ గృహస్థు డుపచరించుచుండ వలసినదనియు మనుస్మృతియందు జెప్పఁబడినది.

సకల ప్రాణివర్గము వాయువు నాశ్రయించి జీవించునట్లు, సకలాశ్రమములవారును, గృహస్థుల నాశ్రయించి జీవించుచున్నారు. ప్రతిదినము, నన్నదానము చేతను, జ్ఞానదానముచేతను, బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాసాశ్రమములలో నుండువారిని భరించుచు నుపచరించుచు నుండుటచేత నెల్లయాశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠమనఁబడుచున్నది. ఇహపరలోక సౌఖ్యములను గోరువారిచేత గృహస్థాశ్రమము స్వీకరింపఁబడవలెననియు జితేంద్రియులగు వారికి గృహస్థాశ్రమ మాధారమనియు జెప్పఁబడుచున్నది. మఱియు, గృహస్థు పంచమహాయజ్ఞము లొనరించుటచే, ఋషులు, పితరులు, దేవతలు' భూతములు, అతిథులు సంతుష్టులై యాశీర్వదించి మేలొనరించు చుం

దురు. గృహస్థాశ్రమ మందుండువారు స్వాధ్యాయముచేత ఋషులను, హోమములచేత దేవతలను, శ్రాద్ధములచేతఁ బితరులను, అన్నముచే నతిథులను, బలికర్మచేత భూతములను సంతృప్తిఁ జేయవలెను.

మనుజుఁడు పుట్టువుతోడనే మూఁడు ఋణములను గలిగి పుట్టుచున్నాఁడు. ఆ మూఁడు ఋణములనెడి బంధమునుఁ బోఁగొట్టుకొనక మోక్షమును జెందఁజాలఁడని పారాశర స్మృతియందుఁ జెప్పఁబడుచున్నది. మూఁడు ఋణములనుఁ బోఁగొట్టుకొనుటకు గృహస్థాశ్రమము దప్ప వేఱుమార్గములేదు. త్రివర్గ సంపదను సేవించినవానికే చతుర్థ పురుషార్థమగు మోక్షము లభించును. లేనివానికి బహుళతర క్లేశములు గలుగును.

నియమపూర్వక వేదాధ్యయనముచేసి, బ్రహ్మచర్యముచే ఋషులను, గృహస్థాశ్రమము స్వీకరించి, పుత్త్రులనుఁబడసి పితరులను, శక్తికొలది యజ్ఞయములఁజేసి దేవతలను సంతృప్తిపఱచి, వారిఋణములను దీర్చి పిమ్మట మనస్సును మోక్షమందు బ్రవేశింప జేయవలయును గాని ఋషి, పితృ, దేవఋణములనుఁ దీర్చక మోక్షము నాశ్రయించెనేని యధఃపతితుండగుచున్నాఁడని శ్రుతి స్మృతులయందు జెప్పఁబడుచున్నది. ప్రతి పురుషుఁడును పూర్వ జన్మంబులయందు నీ జన్మంబు నందుండు బాపంబులు సేయుచుండుటచే బాపంబులు బహుళంబులై యుండును అవి తీర్చుకొనుటకుం దానొక్కఁడే చేసికొను సుకృతంబులు చాలవు. కాబట్టి యందుకుఁదగిన సహాయ సంపదం గూర్చికొనుట యావశ్యకము ఇంతియేగాక తాను దేవర్షి పితృఋణగ్రస్తుండై యుండుననుటను గూర్చి పైని జెప్పఁబడినది యవి తీర్చుకొనుటకును సహాయాపేక్షగలదు. అందు ముఖ్యసహాయము పుత్త్రుడు, పుత్రుడు సేయు ధర్మములవలన దనకు నరక నిస్తరణంబును స్వర్గాది లోకప్రాప్తియుం గలదనుట బహుప్రమాణసిద్ధము. "ఆత్మావై పుత్ర నామాసి" అనుశ్రుతి, తానే పుత్రుండను పేరనుండునను నర్థముం జెప్పును. తాను పుత్రునితో భిన్నుండగుట యనుపపన్నముగాన తాను జేసికొనుధర్మంబులు దనకెట్లు మేలుసేయునో, యట్లుపుత్త్రుఁడు సేయు ధర్మంబును దనకు మేలు సేయునని ఫలితార్థము. "జ్ఞాత్వా కర్మాణి

కుర్వీత" దెలిసికొని కర్మాచరణము జేయుఁదగును. ఏకాగ్నికాండము రెండు ప్రపాఠకములుగాను వీనిలో ప్రథమ ప్రపాఠకమునందు (౧౮) పదునెనిమిది ఖండలును, రెండవ ప్రపాఠకమందు (౨౩) యిరువది మూడు ఖండలును, అయితే ఆపస్తంబులవారు సూత్రమును రచించిరి. దీనికే గృహ్యాసూత్రమని పేరు. ఈ సూత్రమునకు సుదర్శనాచార్యులవారు భాష్యమును జేసిరి. ఆసూత్రము వినియోగ విధులను దెలియజేయుచున్నవి వినియోగమనఁగానే యేమంత్రముతో నే యే కార్యమును జేయవలసినదిన్ని తెలియజేయునది విధి యనఁగా పంచదశకర్మలు వాని వాని కార్యము లేకాలమం దెవరిచే నేరీతిగ జేయవలసినదిన్ని తెలియ జేయునది. ఈ మంత్రపన్నములలోని మంత్రములు కృష్ణ యజుర్వేదముయొక్క తైత్తిరియ్య శాఖలోనుండు మంత్రములు మంత్ర ప్రశ్నలని చెప్పుకొనుచున్నాము. మఱియు పంచదశ కర్మలయొక్క మంత్రపన్నములయందుండు వివరణము ప్రస్తుతం గ్రంథ బాహుళ్యమగునని విస్తరించలేదు. ఈ గంథము నందుండు ముద్రణ స్ఖాలిత్య దోషములు గనుగొన్న మహనీయ్యులు వానిని సవరించి నాకుఁ బంపినచో మూడవ కూర్పునందు సవరించి ముద్రించెదను గనుక బుధోత్తములను ప్రార్థించెదను.

శ్రీలక్ష్మీనృసింహాముద్రాక్షరశాలా,
18/35 బచ్చుపేట, బందరు.

ఇట్లు,
చల్లా సుబ్బరాయశాస్త్రి.



# విషయానుక్రమణిక.

## శ్రీకృష్ణ యజుర్వేదే ఏకాగ్నికాండే ప్రథమ ప్రపాఠకః.



విషయములు సమాప్తము.



# వివాహ కార్యక్రమము.

నిశ్చితార్థము:- శుభసమయమందు పంచాంగ శుద్ధిగల శుభ లగ్నమందు పెళ్ళికుమార్తెను వరునికొఱకు నిశ్చయించుట. పెళ్ళి కుమారుని తండ్రిగారికి తాంబూలమిచ్చి తమపుత్రికను యివ్వనిశ్చ యించితిమని పెద్దలసన్నిధిలో తాంబూలమివ్వవలెను. పిమ్మట వరుని యొక్క తండ్రిమొదలగువారు తమవాగ్దాన నిశ్చితార్థప్రకారము తమ పుత్రికను పుచ్చుకోనిశ్చయించిన తాంబూలమని చెప్పి యివ్వవలెను. సుగంధద్రవ్యముల బంధువర్గములవారికి సమర్పించి పిమ్మట పురో హితులను సంతోషపఱచవలెను. "ధ్రువంతేరాజా" యను మంత్ర మును చూర్ణికను మొదలగునవిచెప్పి వధువునకు పసుపు కుంకుమ చీరె రెవిక ఫలపుష్పములు సువర్ణాభరణములు యివ్వవలెను.

లగ్నము నిశ్చయించుట:- శుభలగ్నము నిశ్చయించుటకు జ్యోతిష్కున వద్దకువెళ్ళి వధూవరుల జన్మ, నామనక్షత్రములు చెప్పి జామిత్రశుద్ధిగల చంద్ర తారాబలాది సర్వము అనుకూలమగు యేక వింశతి దోషరహితమగు మంచిముహూర్తమును లగ్నపత్రికా రూప ముగా గ్రహించి వారిని పూజించి యాశీర్వాదమును బొందవలెను.

శుభలేఖనంపుట:- వధువు తండ్రి శుభలేఖను వరునియొక్క తండ్రికి పంపవలయును. పిమ్మట తమరు పంపించిన శుభలేఖ ప్రకా రము వివాహమునకు తరలి వచ్చుచున్నారమని ప్రత్యుత్తర లేఖను వ్రాసి పంపించవలెను.

పెళ్ళికుమార్తెను చేయుట పసుపుకొట్టుట:- శుభసమయంబున పెళ్లికుమార్తెను పుల్లికుమారుణ్ణి యవరి గృహమందు వారు ముందుఁ గా వరుఁడు పిమ్మట వధువును మంగళవాద్యాది ధ్వనులతో విఘ్నే శ్వరపూజా శోభనదేవతాపూజా మొదలగునవి చేయించి పసుపు కొట్టవలయును. హరిద్రాచూర్ణమును వివాహమం దుంచవలయును. మంగళహార్తి పిమ్మట మంగళాస్నానము నూతన వస్త్ర ధారణము మొదలగునవి జరుపవలయును.

అంకురారోపణము:- వధువు గృహమందు దేవతాహ్వానము అంకురారోపణము మొదలగునవి నాంది సమారాధనము కొందఱు సద్యస్కాలమందు జరుపుదురు. వారివారియాచారముచొప్పున జరప వలెను. పాలికలుక్రమవిధిగాపూజించి వివాహవేదికయందుంచవలెను.

కళ్యాణమంటపము స్నాతకవ్రతము:- కళ్యాణ మంటపమును విధిప్రికారముంచవలయును. వరునిగృహమందు స్నాతకవ్రితము విధి ప్రికారము జరిపి కాశియాత్రకు వెళ్ళబోవుచుండగా మార్గమధ్యమున వధువుయొక్క సహోదరుఁడు నూతన వస్త్రాభరణములచే పూజించి బావగారు మీరు గృహస్థాశ్రిమ స్వీకారముచేయుఁడు అస్మత్సహో దరిని మీకిచ్చి వివాహముచేసెదముగాన దయచేసి పాణిగ్రహణము నకు తరలి రావలసినదనిచెప్పి నమస్కరించవలయును. పిమ్మట తథా స్తు అని అచార్యుఁడుపలుకవలెను పిమ్మట బావమరిదిని వస్త్రములచే సత్కరించవలయును.

వధూవరుల మంగళస్నానము:- వివాహమునకు వధువుయొక్క గృహ మందు ప్రివేశించవలెను. పిమ్మట గణాధిపతిపూజా పుణ్యాహవా చనము తత్రి సంకల్పవిశేషములు శాకునాది మంత్రిము- రక్షాబం ధనపూజా "విశ్వేత్తాతే" అనుమంత్రముచే వరునికుడిచేతికిని, శ్వశుర దత్త ద్వితీయ యజ్ఞోపవీతధారణ- కన్యావరణార్థము సుహృద్వర ప్రేరణము- గౌరీపూజా కంకణపూజా "బృహత్సామ" అను మంత్ర ముచే కన్యకయొక్క యెడమచేతికినిఁ గట్టవలయును. పిమ్మట గోత్రో చ్చారణము వరాన్వేషణప్రేషణము- కన్యాదాత పత్నీ సహితుఁడై సంకల్పముచేసి పాద్య కలశోదకము నభిమంత్రించి వరుని పాదప్రక్షా ళనముచేసి మధుపర్కమునిచ్చునది- పాదప్రక్షాళనము చే బోయిన తేజస్సును మఱల గ్రిహించుటకై వరుఁడు "మయిమహో" మంత్రి మును పఠింపవలెను.

సముద్రిమందు జలమువిడుచుట:- కూర్చపట్టుకొని "అర్వాణీ యా ఆపః"అను మంత్రిముచే నభిమంత్రించి అంజలియందుంచబడిన జలమును వరుఁడు "విరాజోదోహోసి" యను మంత్రిముచే జపించి

నీళ్ళు విడువవలయును- వరునకు వస్త్రద్వయ ధారణానంతరము వరు డాచమనము చేయవలయును.

శ్లో॥ పూర్వమమృత మాచమ్య సోమపాన తథో_త్తరే। దక్షిణేపుసరా
చమ్య పునస్నానంతు పశ్చిమే॥

మధుపర్క ప్రాశనము అనఁగా పెరుగును తేనెయును ఒకపాత్ర యందుఁగలిపి దానిని కంచు పాత్రముచే మూసి రెండు కూర్చలతోఁ దీసికొని యిది మధుపర్కమని దాత చెప్పవలయును- వరుఁడా మధుపర్కమునుఁదీసికొని పైనగప్పియుండు పాత్రనుతీసివైచి " త్రి వ్యై విద్యాయై,, "ఆమాగన్ యశసా,, నీరెండుమంత్రములచే సంస్కరింపఁ వలయును- "అమృతోప స్తరణమసి,, అని యుదకమును లో ప లి కి పుచ్చుకోవలయును- రెండుపర్యాయములు ఆచమనముచేసిన పిమ్మట అత్తగారు చేతిలోఁబెట్టగా యన్మధునో మధవ్యం,, అను మంత్రము చేత ముమ్మారు వరుఁడు ప్రాశనముఁజేయవలయును- తదుపరి వరుఁడు ఉదకమును పానముజేసి చేతినికడిగికొని రెండు పర్యాయము లాచమనముఁ జేయవలయును-

గోవును అభిమంత్రించుట:- "గౌరితిగాం,, అను మంత్రముచే దాత గోవును వధింపఁదలతువా? విడువఁదలతువాయని యడిగినప్పుడు ప్రతిగృహీత వధింపఁదలచినచో "గౌరస్యప హతపాప్మా" అను మంత్రములచేనున్ను, విడువఁదలచినచో "యజ్ఞోవర్థతాం" అను మంత్రముల చేతనున్ను ప్రత్యుత్తరమిచ్చును గోవుకు ప్రతినిధిగా వక్కను పైకి యెగురవైచి ఉదకమును త్రాగుగాక. గోవును విడుచునపుడు "ఓముత్సృజత" అని వరుఁడు పలుకవలయును.

సిద్ధమన్నము:- పిమ్మట దాత చెప్పవలసినదేమనఁగా అన్నము సిద్ధపఱచఁబడినదని దాతచెప్పగా వరుఁడు సిద్ధమైన యన్నమును నంగీకరించితి రండిని గట్టిగాఁజెప్పవలయును. పిమ్మట " అంతః ప ట ం కృత్వా" అనఁగా తెఱబట్టవలయును.

తదుపరి కన్యాదాత ప్రాణాయామముచేసి సాలంకృత కన్యా దానము గావించుటకై సంకల్పించవలయును.

షోడశ మహాదానాంతర్గతమగు సాలంకృత కన్యాదాన సమయంబున మహాసంకల్పము పురాణోక్త కర్మప్రకాశికయందుఁ జూడదగును. అస్యశ్రీమదాది ... సాలంకృత కన్యామహాదానం కరిష్యే.

వరునియొక్క గోత్ర ప్రవరలను జెప్పి వధువుయొక్క గోత్ర ప్రవరలనుగూడ జెప్పి కన్యాదానము జేయవలెను. అప్పుడు "తుభ్య మహాం సంప్రదదే" అనువరకు జెప్పవలెను. నమమ అను శబ్దము కన్యాదానమందు జెప్పఁదగదు వరదక్షిణ సువర్ణ మివ్వవలయును:

పెళ్ళికుమార్తెను గౌరీపూజ సన్నిధిలోనుంచి తెచ్చే మేనమామకు బట్టలు యివ్వవలెను. ధరించి తట్టనుసహా పెళ్ళికుమార్తెను తీసికొని రావలయును. ధర్మార్థకామములయందు ఈకన్య నీచేవిడువఁబడి నడువగూడదనియు అనఁగా వరుఁడు సంకల్పించిన ప్రకారము వధువుండవలెను. వ్యతిరేకముండగూడదని కన్యాదాత వరునిఁజూచి చెప్పవలెను. పిమ్మట వరుఁడు ధర్మార్థకామములను మీరి నడుచుట లేదని పెళ్ళికుమారుఁడు పలుక వలయును

సుముహూర్తకాల సమయంబున చూర్ణికాది మంత్రములను పఠించి జీరక సహిత గుడమును శిరస్సునందు బెట్టవలయును ఇదియే సుముహూర్తకాలమని పెద్దలు చెప్పుదురు. "ధ్రువంతే ... అయం ముహూర్త సుముహూర్తోఽస్తు ॥ సుముహూర్తమందు పెళ్ళి కుమారుఁడు పెళ్ళికుమార్తెనుజూచి "అభ్రాతృఘ్నీం" అను మంత్రమునుఁ జపించి కన్నులనుమూసికొని "అఘోరచక్షుర పతిఘ్న్యేధి" అను మంత్రమునుఁజెప్పి కన్యకను జూడవలయును.

కన్యాదాతకు నూతనవస్త్రములు వారియత్తవారు దంపతులకు బట్టలు చదివించుదురు.

దంపతులుభయులు యేకముకూర్చుండి "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని" వధూవరులు ప్రాణాయామముఁ జేసిన వారలయి మన మిరువురము కలిసి సత్క్రియలను జేయవలెను. సంతానము బడయ వలయునని సంకల్పించవలెను. వధువుయొక్క పాపిడియందు "ధర్భం నిరస్యేత్" ధర్భతో తుడిచివేయవలయును. తదుపరి "అర్యమ్ణో అగ్నిం పరియంతు" మంత్రముచే కన్యక శిరస్సునందు దర్భతోఁ జేసిన ◯ చుట్టనుంచి దానియందు కాడియొక్క యెడముతట్టుండెడు రంధ్రమునుంచి 'ఖేనసయితి...' తదుపరి రంధ్రమందు "శంతేహిరణ్యగ్ం" ఈ మంత్రముననుఁజెప్పి సువర్ణముతో గప్పి "హిరణ్యవర్ణా శ్శుచయః" మొదలు అయిదు మంత్రములను పఠించి 'పంచభిస్సకృస్నాపయతి' ఒక్కమారు స్నానము చేయించవలయును 'పరిత్వా గిర్వణోగిర' మంత్రముఁజెప్పి ఖండింపని వస్త్రముచేత నాచ్ఛాదింప వలయును.

యోక్త్రధారణము:- ఆచమించి "ఆశాసానా సౌమనసం" అను మంత్రముతోఁ జేసినత్రాటిని కన్యకయొక్క మొలను కట్టవలెను. నాభికి ఉత్తరపుతట్టు త్రాటిని ఈడ్చుకొని ముడివేసి ప్రదక్షిణముగాఁ జుట్టి నాభికి దక్షిణపు తట్టుంచవలెను. దీనినేయోక్త్రమందురు దర్భ త్రాడు యని కొందరందురు.

శ్లో॥ మాంగళ్యతంతునాఽనేన మమజీవన హేతునా। కంఠేబధ్నామి సుభగే త్వంజీవ శరదశ్శతమ్ ॥ మంగళసూత్రమును గట్టి రెండు ముళ్ళు గట్టివి- మూడవది దూముడిగా వేయవలయును. సభయందుండు వారందఱు దంపతుల శిరస్సునందు అక్షతారోపణము అనఁగా మాంగల్యధారణ ముహూర్తసుముహూర్తోఽస్తు.

తలంబ్రాలు:- "ప్రజాపతి స్త్రియాం" ప్రజామే కామస్సమృధ్యతాం- వరుఁడు పోయవలెను. పశవోమేకామస్సమృధ్యతాం-కన్యయును యజ్ఞోమే కామస్సమృధ్యతాం- వరుఁడును, అన్యోన్యం యుగవతు- వకరికొకరు శిరస్సునందుంచవలెను. నాలుగవ పర్యాయము తూష్ణీం చతుర్థం ర మారులు త్రియోమేకామ స్సమృధ్యతాం అని

పఠించవలెను. "యోవై తాం బ్రహ్మణో" 'ఆగ్నేవిశ్వేభి' మంత్రములను జెప్పి బ్రహ్మముడి వేయవలయును. "పూషా త్వేతో నయతు" ఈ క్రొత్త పెండ్లికూతురి హస్తముబట్టుకొని వివాహ ప్రధాన హోమమునకు బోవలెను. అచ్చట గృహ్యాగ్ని ప్రతిష్ఠాపనము జరుపవలెను.

సప్తపది:- అగ్నికి ఉత్తరపు తట్టు "ఆతిష్ఠేమమశ్మాన" అను మంత్రమును జెప్పి కన్యకను కుడికాలిచేత రాతిపై నెక్కించి నిలుపవలయును. అగ్నిప్రదక్షిణము. లాజహోమము జయాదిహోమము జరుపవలెను, లాజహోమమందు బావమరిదిగారికి బహుమానము. వధువునకు మట్టెలుంచుదురు. హోమాంతమందు 'ప్రత్వాముంచామి' మంత్రములఁజెప్పి యోక్త్రమును ముడి విప్పివేయవలెను. వివాహ గృహప్రవేశ హోమము జయాది హోమములును "ధ్రువక్షితి" ధ్రువనక్షత్రదర్శనము అరుంధతీ దర్శనము అర్ఘ్యమిచ్చువవలెను.

శ్లో॥ కశ్యపాత్రి భరద్వాజోవిశ్వామిత్రో థగౌతమః వసిష్ఠో... స్తథా అర్ఘ్యందద్యాత్ ॥ "ధ్రువమరుంధతీంచ దర్శయతి" ఆగ్నేయ స్థాలీపాకము గంధర్వ ప్రతిష్ఠాపనముల జయాదివర్జము ప్రాజాపత్య హోమమును ఔపాసనము యావజ్జీవము జరుపవలయును.

| | |
|---|---|
| సా—అగ్నయేస్వాహా<br>అగ్నయేస్విష్టకృతేస్వాహా | తండులహోమము. |
| ది—సూర్యాయస్వాహా<br>అగ్నయేస్వాహా | మొదటిదానికన్న రెండవది యధికము |

ఆహుతి సంసర్గదోష నివృత్త్యర్థం వనస్పతి హోమంకుర్యాత్ ॥ తృతీయాహ్నిక క్రియ ప్రాతకాపాసనము సదస్యము మహదాశీర్వచనము పెద్దలను పండితులను సన్మానించుట మొదలగు సభాకట్నం, గ్రామకట్నం జరుపవలెను.

౪ దినముయొక్క అపరరాత్రియందు శేషహోమము గంధర్వోద్వాసనము శేషహోమము జయాదిపరిషేచనానంతరము కర్మణః పుణ్యాహవాచనము. ౫ వ దినంబుడ కంతకట్నాలు.

నాకబలి:- నాకబలిత్రయ త్రింశత్కోటి దేవతా విసర్జనము నకు ముందు కర్మణః పుణ్యాహము నీలలోహిత ధారణము "నీలలోహితే" అను మంత్రముచే(నల్లపూసలు)ధారణము గర్భాదానమంత్రి సంస్కారము పిమ్మట పాన్పు దంపతీ తాంబూలము ఫల దానములు సూర్పవాయనదానము జలపాత్రద్వయంబున "దేవేంద్రాణి నమస్తుభ్యం దేవేంద్ర ప్రియభామిని । వివాహం భాగ్యమారోగ్యం పుత్రి లాభంచ దేహిమే అను మంత్రమును జెప్పి యింద్రాణిఁ బ్రార్థించవలయును (కమ్మాకడియం) అనఁగా బంగారుపువస్తువు వెండివస్తువు జల మందుంచవలెను సువర్ణము వరుడు స్పృశింపవలెను. వెండి వస్తువు వధువు స్పృశింపవలెను. దక్షిణతట్టుననుండు యేనుగమీద వధువును ఉత్తరపుతట్టుననుండు యేనుగుమీద వరుఁడును నిలుచుండి యింద్రాయరాజ్ఞే అను మంత్రమును పఠించుచు మూడుప్రదక్షిణములను జేయవలయును. "వాత్తో దేవతా" అను మంత్రములను పఠించునది ప్రిదక్షిణమందు జ్యోతులు వెలిగించుదురు 33 అని కొందరు ౧౬ అని కొందరు చెప్పుదురు. కంకణ విసర్జనము వధూ గృహ ప్రవేశానంతరము చేయుదురు. "కంకతో నకంకతో" అను మంత్రమును చెప్పుదురు. పిమ్మట వసంతోత్సవము అయిదవ దినంబున పగలే చేతురు. దండాడింపు అప్పగింతలు వధూగృహప్రవేశముచేయవలెను. తక్కిన కర్మలకు క్రమవిధానము గ్రంథ బాహుళ్యమగునని ఈ ద్వితీయకూర్పునందు జేర్పబడలేదు. ఈవివాహప్రయోగము సూత్రీయము భట్టీయము అని ద్వివిధము. శాస్త్రమునందు సూత్రీయమునకుఁ బ్రాధాన్యము కలుగుచున్నను క్రియా సౌకర్యార్థము భట్టీయ మీప్రాంతము లందు వాడుకలోనున్నందున భట్టీయప్రికారము కార్యక్రిమము వ్రాయబడెను. సూత్రీయ భట్టీయములకుఁ గార్యములు జరుపుటయందు ముందువెనుక భేదములుగాని ప్రధానమంత్రిములందు భేదము చూప

ట్టదు. కంకణ విసర్జనము నూతన వధూగృహాప్రివేశానంతరమందు జరుపుదురు.

* ఆ ధీ న మం త్రః. *

శ్లో॥ అష్టవర్షా త్వియం కన్యా పుత్రివత్పాలితామయా। ఇదానీం తవ దాస్యామి దత్తాం స్నేహేన నపాలయ ॥ ఇతి కన్యాహస్తం గృహీత్వా క్షీరేణ సంస్పృశ్య వరహస్తే నిక్షిపేత్ ॥ ఇతి భర్తుః ॥ అష్టవర్షా + ఇదానీం తవపుత్రిస్య దత్తాం స్నేహేన పాలయ ॥ ఇతి శ్వశురస్య ॥ శ్లో॥ అష్టవర్షా...తవపౌత్రస్య దత్తాం స్నేహేనపాలయ॥ ఇతి భర్తృ పితామహస్య। అష్టవర్షా ...ఇదానీం తవ భ్రాతుశ్చ దత్తాం స్నేహేనపాలయ ॥ ఇతి భర్తృ భ్రాతుః। । అష్టవర్షా...ఇదానీం తవబంధోశ్చ దత్తాం స్నేహేనపాలయ ॥ ఇతి బంధూనాం ॥ ఇతి ఆధీనమంత్రి స్సమాప్తః.



వివాహ క్రిమవిధి సంపూర్ణము.

వలయువారు:—

శ్రీ ల క్ష్మీ న ర సిం హ ము ద్రా క్ష ర శా ల,
18/25 బచ్చుపేట, బందరు.

# కార్తీక పురాణము.

(పాద్మం)



[ప్రతి 1కి 2—0—0] [29 అధ్యాయములుగలవు.

సత్యభామా శ్రీకృష్ణ సంవాదము సత్యభామ పూర్వజన్మ వృత్తాంతము శంభాసురుడు వేదములను నుద్ధరించుట- ప్రయాగ మహాత్మ్యము కార్తీక వ్రతవిధానము వ్రతోద్యాపన జలంధరోత్పత్తి తద్వాహము- ఇంద్ర జలంధరులయుద్ధము- జలంధర జయము- హరి జలంధరుల యుద్ధము- హరిసముద్రమందు శయనించుట- జలంధరుడు పార్వతికొరకు రాహువునుదూతగాపంపుట- కీర్తిముఖోత్పత్తి చక్రోత్పత్తి శివజలంధరులయుద్ధము- సంకులయుద్ధము- జలంధరీ మాయా ప్రభావము- విష్ణువు జలంధరుని భార్యయగు బృందను మోసపుచ్చి తత్పాతివ్రత్య భంగముచేయుట- బృంద హరిని శపించుట- జలంధర మాయాశివుని పరమేశ్వరుడు వధించుట- తులసీ ధాత్రి మహిమలు ధర్మదత్తుని చరిత్రము చోళరాజు చరిత్రము- మొదలగు బహువిషయములు బహు వుపమానో పేతములతోనిండిన గ్రంథము.

# ఉత్తర కాలామృతము.

శ్రీ మహాకవి కాళిదాస విరచితము ఆంధ్ర టీకాతాత్పర్య సహితం.

గ్లేజుపేపరు ప్రతి 1కి రు. 2-0-0

ప్రథమ బిందువునందుండు విషయములు, జన్మకాలాది సాధనము: పాదచ్ఛాయలు, పగటిప్రొద్దు నిశ్చయించు విధానము, రాత్రి ప్రొద్దు నిర్ణయము, జాతకనక్షత్ర ఘటికల నిర్ణయము, మాందీ గ్రహ గుళిక గ్రహ సాధనము, ప్రసవగృహ నిర్ణయము, పితృస్థిత ప్రదేశము ప్రసూతిస్థిత ద్వారాది నిర్ణయము మొదలగు బహువిషయాలుగలవు.

# నవగ్రహశాంతి విధానము

ప్రతి 1కి రు. 1—0—0

## గ్రంథస్థ విషయములు

ఇందు నవగ్రహస్తోత్ర, మంత్ర యంత్ర, జపహోమ, గ్రహశాంతులు, మొదలగు అనేకవిషయములతోనిండిన గ్రంథము. ప్రతి 1కి రు. 1-0-0 స్వల్ప ప్రతులే ముద్రించితిమి. వెంటనే వ్రాసి తెప్పించుకొనవలెను. గ్రంథస్థ విషయములు శాంతి సంకల్పము- నవగ్రహ మండలములు, ప్రతిమానియమం సూర్యగ్రహారాధన చంద్ర- కుజ- బుధ- బృహస్పతి- శుక్ర- శని- రాహు- కేతు- ఉప త్ర్యంబక స్తోత్రరాధనము. నవగ్రహమంత్రజపములు, కవచములు, స్తోత్రములు, జపానుష్ఠానములు, జపసంఖ్యావిషయః, నవగ్రహ తర్పణము, హోమము, దానములు, మఱియొక విధాన దానములు, శనైశ్చర కథారంభము, సర్వపీడా నివారణము, శని బృహస్పతిని రక్షించుట, శనిదృష్టి, ఏల్నాటిశని, వీరసేనుడు శనిని పూజించుట, శని గ్రహమగుట, శని మందగామి గురు శిష్య సంవాదము, తేలు మంత్రము, నవగ్రహ యంత్రములు, సంతానయంత్రము, గోవృద్ధి- పరపీడా నాశన- వశీకరణ- జయ- వైరినిడుచు- స్నేహ- గర్భ ధారణ- యుద్ధమందుజయ- రాజ్యవశ్య- గ్రహనాశన- సర్ప- రోగనాశన- స్త్రీబహిష్టు- పిచ్చి విడిచే- స్త్రీ నీళ్ళాడు- భార్యా మోహన- వంధ్యాపుత్ర- బీజాక్షరములు- నవగ్రహ అష్టోత్తర శత నామావళి, నవగ్రహ మంగళాష్టకములు, మహాదశాది దానములు. అంతర్దశాది దానములు. నవరత్న అంగుళ్యాభరణము, తైలావలోకనము, రుద్ర అభిషేకము, సూర్యనమస్కారములు, అపమృత్యుజపము, నవగ్రహ జపము, హోమము, సువాసినీపూజా, బ్రాహ్మణ సమారాధనము, శాంతులు మొదలగు అనేకవిషయములుగలవు.



# శ్రీ కృష్ణయజుర్వేదైకాగ్నికాణ్డే

## ప్రథమప్రపాఠకారంభః

—:౦:—

### ప్రథమమన్త్రప్రశ్నప్రారమ్భః
### అథాద్రాపరిషేచమంత్రాః॥

మూ॥ అదితేఽను మన్యస్వ ॥౧॥ అనుమతేఽను మన్యస్వ ॥౨॥ సరస్వతేఽను మన్యస్వ ॥౩॥ దేవ సవితః ప్రసువ ॥౪॥

ప॥ అదితే । అను । మన్యస్వ ॥ ౧ ॥ అనుఽమతే । అను । మన్యస్వ ॥ ౨॥ సరస్వతే॥ అను । మన్యస్వ । ॥౩। దేవ । సవితః । ప్ర ॥ సువ ।౪।

అర్థము॥ హే అదితే= (దేవతలకు తల్లివయిన) ఓ అదితిదేవి, అనుమన్యస్వ= (నాచేతఁజేయఁబడుచున్న కర్మను) అంగీకరింపుము॥౧॥ అనుమతే=ఓపౌర్ణమాసీదేవతా అనుమన్యస్వ=అంగీకరింపుము ॥౨॥ హే సరస్వతే—ఓసరస్వతీదేవి, అనుమన్యస్వ= అంగీకరింపుము ॥౩॥ హే సవితః=ప్రేరకుఁడవగు, దేవ=పరమేశ్వరుడా, ప్రసువ = ప్రేరణఁజేయుము ॥౪ ॥ హేఅదితే= అఖండుఁడవగునో పరమాత్మా- హే అనుమతే = సమస్తయు దెలిసిన పరమాత్మా. హే సరస్వతే = సర్వవ్యాపకుఁడవగు పరమాత్మా సవితః=సృష్టికర్తవయిన, హేదేవ=ఓపరమాత్మా, నాచేత చేయఁబడుచున్న కర్మముల నంగీకరింపుము.

| | |
|---|---|
| ఇతి పూర్వపరిషేచనమ్ | ఇత్యుత్తరపరిషేచనమ్ |
| అదితేను మన్యస్వ ॥౧॥ | అతితేఽన్వమగ్గ్ స్థా॥౧॥ |

ఇతి దక్షిణతః ప్రాచీనమ్.

---

| | |
|---|---|
| అనుమతేనుమన్యస్వ ॥౨॥ | అనుమతే త్వ మగ్గ్ స్థా ॥౨॥ |

ఇతిపశ్చాదుదీచీనమ్

| | |
|---|---|
| సరస్వతేను మన్యస్వ ।౩॥ | సరస్వతే త్వమగ్గ్ స్థా ॥౩॥ |

ఇత్యుత్తరతః ప్రాచీనమ్

దేవ సవితః ప్రసువ ॥౪॥ దేవసవితః ప్రాసావీః ॥౪॥

ఇతి సమంతమ్

## —♦ అథ మంత్ర ప్రశ్నారంభః ♦—

మూ॥ ప్రసుగ్మంతా ధియసానస్య సక్షణి వరేభి ర్వరాగ్ అభిషు ప్రసీదత। అస్మాక మిందర్ ఉభయం జుజోషతి యత్సౌమ్య స్యాంఽధసో బుబోదతి ॥ ౧ ॥

ప॥ ప్రఽసుగ్మంతా । ధియసానస్య ! సక్షణి । వరేభిః । వరాన్ ॥ అభిః । సుప్రసీదత । అస్మాకం ॥ ఇంద్రః । ఉభయం ॥ జుజోషతి। యత్ । సౌమ్యస్య ॥ అంధః ॥ బుబోదతి ॥౧॥

అర్థము॥ ప్రసుగ్మంతా=విస్తారముగ, బాగుగా నడచునట్టి, (హేసఖాయః) ఓస్నేహితులారా, (వః)=మిమ్ము, (౨)ధియసానస్య=ధ్యానించుచున్న, (వరస్య)= వరుఁడయిన (మమ) =నాయొక్క. [3] సక్షణి=కూర్చదగిన (ఈ వివాహకార్య మందు) వరేభి=శ్రేష్ఠములైన, (మార్గై)=మార్గములచేతను, వరాన్=కోరదగినట్టి (కన్యయొక్క తండ్రి మొదలగు) వారలను, అభిషుప్రసీదత = అభిముఖముగా, లెస్సఁగా=బాగుగా పొందుఁడు, ఇంద్రః=ఇంద్రుఁడు, లేక పరమైశ్వర్య యుక్తుఁ డగు భగవంతుఁడు, (౪) అస్మాకం=మాకు అనఁగా నాకును, ఆ కన్యకకును, ఉభయం = దాంపత్యము, (౫) జుజోషతి = సేవించుచున్నాడు, అనఁగా కలుగఁ జేయుచున్నాఁడు యత్=యెందువలన ననఁగా, (౬) సౌమ్యస్య =సోమలతాగస రూపమైన అనఁగా శ్రేష్ఠమయిన (౭. అంధసః=అన్నమును, బుబోదతి=తెలిసికొను చున్నాడు.

తా॥ ఓ స్నేహితులారా! ఈ వివాహమును గూర్చి మీరు మంచి మార్గముల చేతను, కన్యయొక్క తండ్రి మొదలగు వారల సమీపమునకు త్వరగా వెళ్ళి కార్యమును సఫలము చేసికొని రావలయునని వరుఁడు ధ్యానించుచున్నాఁడు. కాఁబోవు దంపతులు చేయు యజ్ఞమందుఁ దనకు సోమరసరూపమయిన యన్నము దొరకునని ఇంద్రుఁడీ వివాహకార్యమునకు సహాయుఁడగును.

---

౧ న్యా। ప్ర-సు॥ ఇత్యుపసర్గద్వయపూర్వాకాత్ - గమేర్లట్ - ఛాందస శ్శపోలుక్ - లటశ్శత్రాదేశః - ఛాందస శ్చాదేశాభావః - గమహనేత్యుపధా లోపః - సుపాంసులుగితి - జసః - ఆకారదేశః ॥ ఈపదము ప్రథమాబహువచ నాంతము - ఉపసర్గావుదాత్తౌ । శతురకారఉదాత్తః । విభక్త్యాకారోఽనుదాత్తః॥

౨ ధి - ధారణే - అస్మాద్ధాతోః - ఛాందసం ! అసానచ్ ప్రత్యయః - నీచకిత్ ! చిత్త్వాదంతోదాత్తః॥

3 షచ - సమవాయె - అస్మాద్ధాతోః ఔణాదిక స్వనిః - ఛాందసః - ప్రత్యయస్యాదిరుదాత్తః । సుపాంసులుగితి సప్తమ్యాలుక్ - ఈ పదమునకు హరదత్తాచార్యులు సమానక్షణమందని యర్థము వ్రాసిరి - శ్రీవిద్యారణ్యులవారీ పదమునకు "సక్షణి - సేవాయాం సద్గుణకే సేవ్యే యజ్ఞే" యని యజ్ఞపరముగ వ్రాసిరి.

౪ ద్వివచనస్థానమందు "అస్మదోద్వయోశ్చ" అనుసూత్రముచేతను బహువచనప్రత్యయము॥

౫ జుషీ - ప్రీతిసేవనయోః ॥ అస్మాద్ధాతో ర్లట్ ఛాందసో లిడ్వద్భావః తస్మాద్విత్వం ॥

౬ ఛాందసఔకారః॥ ౭ ద్వితీయార్థమందుషష్ఠి

# వి వా హ మ ం త్రాః

మూ॥ అనృక్షరా ఋజవస్సంతు పంథా యేభిస్సఖాయో యంతి నో వరేయం । సమర్యమా సంభగో నో నినీయా త్సంజా స్పత్యగ్ం సుయమమస్తు దేవాః ॥౧॥

ప॥ అనృక్షరాః । ఋజవః । సంతు । పంథాః ॥ యేభిః । సఖాయః । యంతి నః । వరేయం । సం । అర్యమా । సం । భగః । నః నినీయాత్ । సం । జాస్పత్యం ॥ సుయమం । అస్తు దేవాః॥

అర్థము॥ హే దేవాః = ఓ దేవతలారా, యేభిః = ఏ మార్గములచేతను, నః = మాయొక్క సఖాయః = స్నేహితులు, వరేయం = కోరఁదగిన (కన్యకయొక్క తండ్రి మొదలగు) వారలనుగూర్చి, యంతి = వెడలుచున్నారో - పంథాః = (ఆ) మార్గములు, అనృక్షరాః = ముండ్లు, బెడ్డలు మొదలగు కఠినవస్తువులు లేనివియును ఋజవః = తిన్ననివియును, సంతు = అగుఁగాక, నః = మా యిద్దరను, అర్యమా = అర్యముఁడను దేవుడు, లేక సర్వవ్యాపకుఁడగు భగవంతుఁడు, సంనినీయాత్ = కూర్చుంగాక, భగః = భగుఁడను దేవుడు, లేక సద్గుణసంపన్నుఁడగు భగవంతుడు,

సంనినీయాత్ = కూర్చుగాక, జాస్పత్యం = దాంపత్యము, సం = లెస్సగాను, సుయమం=యోగ్యసంబంధము గలదిగాను. అస్తు=అగుగాక ॥

తా॥ కన్యను సంఘటనచేయుటకుఁ బంపఁబడు స్నేహితులయొక్క మార్గములు ముండ్లు మొదలగునవి లేక తిన్నగ నుండవలయుననియు, అర్యమాదిదేవతలు దాంపత్యమును సంఘటన జేయవలయుననియు వరుఁడు భగవంతుని బ్రార్థించుచున్నాడు.

మూ॥ అభ్రాతృఘ్నీం వరుణ పతిఘ్నీం బృహస్పతే ఇంద్రా పుత్రఘ్నీం నక్ష్మ్యంతా మస్యై సవిత స్సువ ॥3॥

ప॥ అభ్రాతృఘ్నీం । వరుణ । అపతి । ఽ ఘ్నీం । బృహస్పతే । ఇంద్ర ॥ అపుత్ర ఽ ఘ్నీం । లక్ష్మ్యం । తాం అస్యై । సవితః ॥ సువ ॥

అ॥ హేవరుణ = ఓ వరుణుఁడా. లేక, లోకులచే గోరికెలడుగఁబడు పరమాత్మా. అస్యై=(౧) ఈకన్యకకు. అభ్రాతృఘ్నీం = తోడఁ బుట్టినవాండ్రను జంపనియట్టి, లక్ష్మ్యం=(౨) లక్ష్మిని, సువ=ఇమ్ము, హే బృహస్పతే = ఓ బృహస్పతీ లేక యోగ్యులను బాలించు పరమాత్మా, అపతిఘ్నీం=పెనిమిటిని జంపనియట్టి, లక్ష్మ్యం=లక్ష్మిని, సువ=ఇమ్ము, హేఇంద్ర=ఓయింద్రుఁడా, లేక పరమైశ్వర్యముగల భగవంతుఁడా, అపుత్రఘ్నీం=పుత్రులతి జంపనట్టి, లక్ష్మ్యం=లక్ష్మిని సువ=ఇమ్ము, హేసవితః=ఓసూర్యుఁడా, లేక సృష్టికర్తవగు పరమాత్మా, తాం లక్ష్మ్యం=ఆలక్ష్మిని, అనఁగా భ్రాతలను, పెనిమటిని, పుత్రులను జంపనియనియట్టి లక్ష్మిని- సువ=ఇమ్ము.

---

ఈ మంత్రము, ఋగ్వేదము - మం ౧౦ - సూ - ౮౫ - ఋ- ౨3-అథర్వవేదము - కాం ౧౪ - అను ౧ - మం 3౪ - కొన్నిపదములు భేదముగానున్నవి.

తా॥ ఈ కన్యను భ్రాతృపతిపుత్రనాశనము లేనిదానినిఁగా జేయుమని వరుఁడు దేవప్రార్థనఁ జేయుచున్నాఁడు.

మూ॥ అఘోరచక్షు రపతి ఘ్న్యేధి శివా పతిభ్య స్సుమనా స్సువర్చాః జీవసూ ర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥౪॥

ప॥ అఘోరఽచక్షుః ॥ అపతిఽఘ్నీ ॥ ఏధి । శివా॥ పతిభ్యః ॥ సుమనాః

సు౨వర్చాః॥ జీవ౨సూః ॥ దేవ౨కామా ॥ స్యోనా ॥ శం॥ నః॥ భవ ॥ ద్వి౨పదే శం ॥ చతుః౨పదే॥౪॥

అ॥ (హేవధు)=ఓచిన్నదానా (త్వం)=నీవు, అఘోరచక్షుః=భయంకరము గాని దృష్టిగలదానవును, అపతిఘ్నీం=పెనిమిటిని జంపనిదానవును, ఏధి=ఆగుము పతిభ్యః=పెనిమిటికొఱకును, బావ మరదులకొఱకును, శివా=మంగళప్రదురాలవు ఏధి=ఆగుము, సుమనాః=మంచి మనసుగలదానవును, సువర్చాః = మంచితేజస్సు గలదానవు, ఏధి= ఆగుము, జీవసూః = జీవించెడి సంతానము కనుదానవును, దేవకామా = దేవతలను, (యాగమునిమిత్తము) లేక పరమేశ్వరుని (సౌభాగ్యము నిమిత్తము) కోరుదానవును, స్యోనా—(పశస్తమయినదానవును, భవ =ఆగుము, నః= మాసంబంధమయిన, ద్విపదె=ద్విపాదజంతువులగుమనుష్యులకొఱకును,చతుష్పదె= చతుష్పాదజంతులగు గోవులు మొదలగువానికొఱకును, శం=సుఖకరురాలవు, భవ=ఆగుము ॥౪॥

---

ఈ మంత్రము అథకాం ౧౪,అ-౧-మం ౬౨-(అభ్రాతృఘ్నీం వరుణా పశుఘ్నీం బృహస్పతే । ఇంద్రాపతిఘ్నీం పుత్రిణీ మాస్మభ్యం సవిత ర్వహ) ఈరీతిగ స్వరపదవ్యత్యయములతో నున్నది. ఈరెండు పాఠములలోను అథర్వవేదమందుండు స్వరముశాస్త్రానుసారముగ గనుపించుచున్నది.

౧ షష్ఠ్యర్థమందు చతుర్థి.

౨ వాఛందసిఅను పాణినియ్యసూత్రముచేత యణాదేశము.

తా॥ ఈ కన్యక తన పెనిమిటియందును, బావలు మొదలగువారియందును మంచితనము గలదియును. నశింపనిసంతానము గలదియును, దేవపూజాసక్తురాలును, భృత్యులయందును, పశువులయందును. ఆదరణముగలదియును, గావలయునని వరుడు దేవప్రార్థన జేయుచున్నాడు.

---

ఈమంత్రము- ఋ, మం-౧౦- సూ ౮౫- ఋ- ౪౪ - అఘోరచక్షు రపతిఘ్న్యేధి శివా పశుభ్య సుమనా స్సువర్చాః వీరసూ ర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదేశం చతుష్పదే ఈరీతిగ పదవ్యత్యయముగా నున్నది.

మూ॥ ఇద మహం యా త్వయి పతి ఘ్న్యలక్ష్మి స్తాం నిర్దిశామి॥౫॥

ప॥ ఇదం ॥ అహం । యా । త్వయి ॥ పతిఘ్నీ । అలక్ష్మీ । తాం । నిః దిశామి ॥౫॥

అ॥ (హేవధు)=ఓచిన్నదానా, త్వయి=నీయందు, పతిఘ్నీ = పెనిమిటిని, జంపునట్టి, యా = ఏ (౧) అలక్ష్మీ = అభాగ్యత అస్తి = ఉన్నదో, తాం = ఆ యభాగ్యము, అహం = నేను, నిర్దిశామి=తుడిచితీసివేయుచున్నాను, ఇదం= దర్భచేత పెండ్లికూతునియొక్క భ్రూమధ్యమందుఃదుడుచుట యే యభాగ్యతను దీసివేయుట యగును తా॥ స్పష్టము.

అథ - కాం - ౧౪ - అ - ౨ మం- ౧౭ (అఘోరచక్షు రపతిఘ్నీ స్యోనా శగ్మా సుశేవాసుయమాగృహేభ్య॥ వీరసూర్దేవృకామాస్వతయైదిషీమహి సుమనస్య మానా] ఈరీతిగ పదవ్యత్యయముగా నున్నది,

కృష్ణయజుర్వేదు లీమంత్రముఁలో [పతిభ్యః) అని పటింపుచున్నారు ఋగ్వేద మంగును, శుక్లయజుర్వేదులు వాడుకచేయు వివాహమంత్రమందును (పశుభ్యః) అనియున్నది. పతిభ్యః = భర్తకొరకు అను బహువచనమునకు హరదత్తుఁడు వ్యాఖ్యానములో బావగార్లు మరదులు అని కష్టక్లిప్తిగా నర్ధము వ్రాసినారు. పశు భ్యః = అనుపాఠమందు అట్టిబాధలేదు. ఈమంత్రముఁలో పతిఘ్నీ అనుపద ముండుటచేతను ద్విరుక్తిదోషమును గనుపట్టుచున్నది. పశుభ్యః అనుపదమునకు గోవులు మొదలగునవి యనియర్థము - చతుష్పదే - అను పదమునకు ఏనుగులు - గుఱ్ఱములు మొదలగునవి యర్థము గనుక ద్విరుక్తిదోషమును లేదు

వా॥ ౧ లక్ష్మీశబ్దమునకు ఛందస్సగుటవలన హ్రస్వము.

మూ॥ జీవాగ్ రుదంతి విమయంతే అధ్వరె దీర్ఘా మనుప్రసితం దీధియ ర్నరః వామం పితృభ్యోయ ఇదగ్ సమేరిరే మయః పతిభ్యో జనయః పరిష్వజే ॥౬॥

ప॥ జీవాం । రుదంతి । వి । మయంతె । అధ్వరే । దీర్ఘాం । అనుప్రసితం । దీధియః । నరః । వామం । పితృభ్యః । యె । ఇదం। సంఏరిరె। మయః । పతిభ్యః॥ జనయః పరిష్వజే ॥౬॥

అ॥ యే=ఏ నరులు (కన్యకయొక్క బంధువులయిన జనులు) దీర్ఘాం=గొప్పవి దయిన, ప్రసితిం=ప్రేమానుబంధమును (అనయోః)=మా యిద్దరకును, అనుదీధి

యుః=చేయుచున్నారో, పితృభ్యః=పితృదేవతలకొరకు, వామం=కోరఁదగినట్టియుం (౧) పతిభ్యః =(పత్యుః) పెనిమిటిదైన (నాకు) (౨) మయః = సుఖకరమగునట్టి యు- (౩) జనయః (ఈ) పెండ్లికూతునియొక్క-(౪) పరిష్వజే=ఆలింగనము చేయఁ దగిన ఇదం=ఈ (వివాహకర్మమును) సమేరిరే = ప్రేరణజేసిరో, (తే) = వారు (కన్యాబంధుజనులు) అధ్వరే=హింసారహితమయిన, అనఁగా శుభకరమయిన ఈ వివాహకర్మయందు జీవాం = జీవించియున్న యీ చిన్నదాని గూర్చి, రుదంతి = ఏడ్చుచున్నారు, వియయంతే=వ్యత్యాయమును జేయుచున్నారు.

తా॥ కన్యావియోగమునుగూర్చి దుఃఖించుచున్న బంధువులను సంతోషకర మగు వివాహసమయమందు దుఃఖింపవద్దు వరుడు కోరుచున్నాడు.

---

ఈ మంత్రము యజస్సు అని ఆపస్తంబులవారు గృహ్యసూత్రములో వ్రాసినారు. కాని కృష్ణయజుర్వేదముయొక్క తైత్తిరీయశాఖయందు శుక్లయజుర్వే దముయొక్క కాణ్వశాఖయందును ఈ మంత్రము గనుపింపలేదు.

( ఋక్ - మం ౧౦ సూ ౪౦ ఋ ౧౦ ) ఈమంత్రమునకు విద్యారణ్యుల వారు యజ్ఞములో పారితరనువాకయందు వినియోగఁజెపి, అర్థమును భేదముగా వ్రాసినారు జీవాం, అనుపదమునకు మారుగా ఋగ్వేదమందు జీవం అనియున్నది. ( అథ-కాం ౧౪ అను ౧ మం ౪౬) జీవం రుదంతి వినయం త్యధ్వరం దీర్ఘామనుప్ర సితిం దీధ్యుర్నరః ॥ వామ పితృభ్యోయ ఇదం సమీరిరె మయః పతిభ్యో జనయె పరిష్వజే ఈరీతిగ స్వరపద వ్యత్యములతో అథర్వవేద మందు వివాహప్రకరణమం దున్నది.

---

మూ॥ వ్యుక్షత్క్రూర ముదచంత్వాప ఆస్యై బ్రాహ్మణా స్న్నపనగ్ం హరంతు.అవీరఘ్నీ రుదచంత్వాపః॥౭॥

పదవిభాగం॥ ఉక్షత్ । క్రూరం ॥ ఉత్ । అచంతు । ఆపః । ఆ ॥ ఆస్యై బ్రాహ్మణాః । స్నపనం ॥ హరంతు ॥ అవీరఽఘ్నీః। ఉత్ ॥ అచంతు ః ఆపః ॥౭॥

టీక॥ క్రూరం = ఉదకసంబంధమయిన కలుషత్వము, ౧. వ్యుక్షత్ = దూర ముగా బోవుఁగాక ఆపః = ఉదకములు, ఉదచంతు = మీదికి వచ్చుఁగాక, ౨. ఆస్యై=ఈ చిన్నదానికి, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, స్నపనం = ఉదకమును, ఆ+హరంతు=తీసికొని వచ్చెదరుగాక, ౩. అవీరఘ్నీః=వీరులగు పుత్రులనుజంపని,

అపః=ఉదకములు, ఉదచంతు=మీదికి వచ్చుగాక.

తా॥ కలుషములేని యుదకముల నీచిన్నదాని స్నానము నిమిత్తము బ్రాహ్మణులు తీసికొని రావలసినది.

౬ వ్యా॥ ౧. షష్ఠ్యేకవచన స్థానమందు వ్యత్యయముగా చతుర్థీబహువచన ప్రత్యయము, ౨. సకారాంత ద్వితీయైకవచము. 3. జనిశబ్దమునకు షష్ఠ్యేకవచన స్థానమందు వ్యత్యయముగా ప్రథమా బహువచన ప్రత్యయము. ౪. పరిపూర్వకమయిన ష్వంజ-సంగే-అను ధాతువుకంటె కృత్యార్థమందు కేన్ప్రత్యము ఆలింగనము జేసికొనదగినట్టిది యని యర్థము.

---

ఈ మంత్రము, ఆస్యైబ్రాహ్మణాస్స్న పనీర్హరంత్వవీరఘ్ని రుదజంత్వాపః ఈ రీతిగ స్వరపద వ్యత్యయములతో అథ కాం ౧౪ - అ ౧ మం ౩౯ లో ప్రథమార్థర్చగానున్నది. దీనిని ఋక్కు అని ఆపస్తంబులవారు గృహ్యసూత్రములో వ్రాసిరి. ఋగ్వేదముయొక్క శాకలశాఖలో గనుపించలేదు, ఈ మంత్రముయొక్క ప్రథమపాదము అథర్వవేదమందు గనుపించలేదు.

౭ వ్యా॥ ౧ సేచనార్థకమయిన ఉక్షదాతువున కిచ్చట పోవుట యర్థము లేట్ లకారముయొక్క రూపము ౨. షష్ఠ్యర్థమందు చతుర్థి 3. ప్రథమా బహువచనమునకు వాఛందసి-అను సూత్రముచేతను పూర్వసవర్ణదీర్ఘము.

మూ॥ అర్యమ్ణో అగ్నిం పరియంతు క్షిప్రం ప్రతీక్షంతాగ్ శ్వశ్రో దేవరాశ్చ ॥౮॥

పదవి॥ అర్యమ్ణః । అగ్నిం । పరి ॥ యంతు । క్షిప్రం । ప్రతి । ఈక్షంతాం శ్వశ్వః । దేవరాః । చ ॥౮॥

టీక॥ శ్వశ్వః = అత్తగార్లు అనగా మా యిద్దఱియొక్క తల్లులును, దేవరాః=చ=బావమరదులును, అనగామాయిద్దఱియొక్క తోబుట్టువులును, అర్యమ్ణః= సూర్యునియొక్క లేక సర్వవ్యాపకుఁడగు భగవంతునియొక్క (ప్రసాదాత్)= అనుగ్రహమువలన, అగ్నిం= [వివాహసంబంధమయిన] అగ్నిని క్షిప్రం=శీఘ్రముగాను, పరియంతు=చుట్టునావరించియుందురుగాక, ప్రతీక్షంతాం=[చల్లారకుండునట్లు జాగరూకతచే] చూచుచుందురుగాక తా॥ స్పష్టము.

---

ఈ మంత్రము యజస్సు అని ఆపస్తంబులవారు గృహ్యసూత్రమున వ్రాసినారు

కాని కృష్ణయజుర్వేదముయొక్క తైత్తిరియ్యశాఖయందును శుక్లయజుర్వేదము యొక్క కాణ్వశాఖయందును గనుపించలేదు.

[అర్యమ్ణోఅగ్నింపర్యేతుపూషన్ప్రతీక్షంతేశ్వశురోదేవరశ్చ) ఈరీతిగ పద వ్యత్యయముతో అధర్వం ౧౪-అ ౧-మం ౩౯లో రెండవయర్ధర్చగానున్నది.

ఈ మంత్రముయొక్క తాత్పర్యము, వరునియొక్కయు కన్యకయొక్కయు తల్లులును బావమరదులును వివాహాగ్నికి చుట్టును జాగరూకతగా సంరక్షకులై యుండగలందులకు వరుడు కోరినట్లు కానబడుచున్నది. ఆపస్తంబులవారీమంత్ర ముచేతను కన్యయొక్కశిరస్సునందు ఇణ్వ * మను పేరుగలదర్భవలయము నుంచ వలసినదని వినియోగము చెప్పిరి. హరదత్తాచార్యులు కన్యకయొక్క శిరస్సునందుం చబడు ఇణ్వము యెటులు వలయాకారముగా నుండునో అటులు వివాహాగ్నిని వర కన్యా బంధువులు చుట్టును ఆవరించి సంరక్షణ జేయవలసినదని వ్రాసిరి.

ఇణ్వమనగా ఇరువదిదర్భలను అయిదుదర్భలచేతను వలయాకారముగా జుట్టునది.

* శ్లో॥ పంచభి ర్వలయాకారై ర్వేష్టనం వింశతే స్తథా। పంచవింశతిద ర్భైశ్చ ఇణ్వసంఖ్యా విధియ్యతే ॥

మూ॥ ఖేఽనసః ఖే రథః ఖే యుగస్య శచీపతే । అపాలా మింద్ర త్రిః పూ ర్త్వ్యకర త్సూర్యవర్చసం ॥౮॥

ప॥ ఖే । అనసః । ఖే । రథః ॥ ఖే । యుగస్య । శచేఽపతే । అపాలాం । ఇంద్రః । త్రిః । పూర్త్వీ । అకరత్ । సూర్యఽతర్చసం ॥౮॥

టీక॥ హేశచీపతే = శచీదేవికి భెనిమటివైన యో ఇంద్రా (త్వం) = నీవు అనసః = ఇరుసుయొక్క, ఖే = రంధ్రమందును, ౧. రథః = రథముయొక్క, ఖే = రంధ్రమందును, యుగస్య = కాడియొక్క, ఖే = రంధ్రమందును, అపాలాం = అపాలయను పేరుగల కన్యకను, త్రిః = మువ్మారు ౨. పూర్త్వీ = శోధచేసి, సూర్యవర్చసం = సూర్యునియొక్క తేజస్సువంటి తేజస్సుగలదానిని గా ౩. అకరత్ = చేసితివి.

తా॥ ఓ యింద్రుడా యీ చిన్నదానిని గూడ అపాలనువలె సూర్యతేజస్సు గలదానినిగా జేయుము.

---

(ఖే రథస్య ఖేనసః ఖే యుగస్య శతక్రతో ॥ అపాలా మింద్రత్రిష్పూత్వ్య

కృణో న్సూర్యత్వచం ) ఈరీతిగ పదవ్యత్యయముగా నర్థభేదము లేకుండ ఋక్మం రా-నూ ౮౧ ఋ ౭ గానున్నది. విద్యారణ్యులవా రీమంత్రమునకు శరీర దోషము కలవారు పఠించినయెడల దోషముపోయి సూర్యతేజస్సు వచ్చునని వినియోగము వ్రాసిరి.

అథర్వవేదములో కాం ౧౪ - అ ౧- మం ౪౧ - కొంచెము భేదముగా వివాహప్రకరణములో నున్నది.

తా॥ అత్రిమహాముని కొమార్తెయు, బ్రహ్మవాదిని యను పేరుగల యొకకన్య బొల్లి యను వ్యాధిగలదిగా వున్నదాని నెవడును వివాహము చేకొనినదు డాయెను. అందువలన పాలకులు లేనిది గావున అపాలయను పేరువహించెను. పెండ్లియగుటకు నింద్రు నెట్లు పూజింతునని యెల్లప్పుడును దానికి గోరిక గలిగెను. అది యొకప్పుడు స్నానమునకై నదిలోనికి దిగి ప్రవాహవేగముచేత గొట్టుకొని పోవుచు ఆ కోరిక యే మనసునం గలిగి, నీటం గొట్టుకొని వచ్చుచున్న సోమలతను జూచి యాతీగను దంతములతో నమలి యారసము నింద్రునికి సమర్పించెను. ఇంద్రుండా రసము ద్రావి, రథము, ఇరుసు, కాడి యీమూటిరంధ్రమునయందు నుదకము పోసి యా యుదకముచే నామెను మూడుమారులు స్నానము చేయించి,

మూ॥ శం తే హిరణ్యగ్ం సముశం త్వాప శ్శం తే మేధీ భవతు శం యుగస్య తృద్మ । శం త ఆపశ్శతపవిత్రా భవం త్వథా- పత్యా త్వనగ్ం సగ్ం సృజస్వ ॥౧౦॥

పదవి॥ శం ॥ తే ॥ హిరణ్యం । సం । ఉ । శంతు । ఆపః । శం । తే । మేధీ భవతు । యుగస్య । తృద్మ । శం । తే । ఆపః శతపవిత్రాః భవంతు । అథ పత్యా త్వన్ । సం ॥ సృజస్వ ॥౧౦॥

ఇతి ప్రథమఖండనమాప్తః.

టీక॥ (హేవధు)=ఓ చిన్నదానా, తే=నీకు, హిరణ్యం=(బండికాడియొక్క రంధ్రమందుంచిన) బంగారము, శం=సుఖకరము, (అగుగాక) ఆపః=(ఉదకములు) ౧. సం + ఉ = ౨. సుఖకరములు, ౩. శంతు=అగుగాక, మేధీ = కాడి,

పవిత్రురాలి నొనర్చెను, గాన నామె బొల్లి వదలి సూర్యునితేజస్సుగలది యాయెను. ఈ యితిహాసము హరదత్తాచార్యులు మంత్రపన్నముల వ్యాఖ్యానమున

వ్రాసిరి. ౘ * వ్యా॥ ౧. షష్ఠ్యర్థమందు ప్రథమ- ౨. పూత్వా - అను క్త్వాప్రత్యయాంతమునకు ఈకారణమును, రేఫయును ఛందస్సగుటవలన వచ్చినవి. 3 మధ్యమ పురుషస్థానమందు ప్రథమపురుష.

* "సమునంత్వాపః" అను స్థలమందు సమునంత్వాప అను పాఠము కొన్ని పుస్తకములయందు గనుపించినది గాని మూలమందు వ్రాసిన పాఠమే సంప్రదాయ సిద్ధము, అని హరదత్తాచార్యులు వ్రాసిరి.

తే=నీకు, శం=సుఖకరము, భవతు=అగుఁగాక, యుగస్య=కాడియొక్క, తృద్మ=రంధ్రము, శం=సుఖకరము, (అగుఁగాక) శతపవిత్రాః=అనేకవస్తువులను బవిత్రముచేసెడు, ఆపః=ఉదకములు, తే=నీకు, శం=సుఖకరములు, భవంతు= అగుగాక అథ అటు పిమ్మటను, పత్యా=పెనిమిటినైన (నా) తోడను, తన్వం= (నీయొక్క) దేహమును, సంస్పృజస్వ=కలుపుము ॥౧౦॥

తా॥ బండికాడియొక్క రంధ్రమం దుంచఁబడిన బంగారముమీదుగా ప్రసరించిన యుదకంచేతఁ బవిత్రమయిన యీ కన్యకయొక్క దేహము ఆలింగనమునకర్హమగు నని వరుఁడు కోరుచున్నాఁడు.

"శం తే హిరణ్యం శము సం క్యాప శ్శం త్వాప మేదిర్భవతు శం యుగస్య తర్ద్మ । శంత ఆప శ్శతపవిత్రా భవంతు శము పత్యాతన్వం సంస్పృశస్వ" ఈ ప్రకారముగ గొంచెము స్వరపదవ్యత్యయముతో అథర్వాం ౧౪ అను ౧ మం ౪౦ గా నున్నది.

వ్యా॥ ౧. వ్యత్యయముగా శవర్ణస్థానమందు సవర్ణము ౨. అనర్థకపదము పాద పూరణమే ప్రయోజనముగాఁ గలది 3. సకారస్థానమందు వ్యత్యయముగా శవర్ణము. ప్రథమ ఖండసమాప్తము శ్రీ శ్రీ శ్రీ

మూ॥ హిరణ్యవర్ణా శ్శుచయః పావకాః ప్రచక్రము ర్హిత్వావద్య మాపః శతం పవిత్రా వితతా హ్యాసు తాభి ష్ట్వా దేవ స్సవితా పునాతు

పదవి॥ హిరణ్యఽవర్ణాః । శుచయః । పావకాం । చక్రముః । హిత్వా అవద్యం । ఆపః । శతం । పవిత్రాః ॥ వితతాః । హి ॥ అసు । తాభిః । త్వా ॥ దేవః ॥ సవితా పునాతు॥

టీక॥ హిరణ్యవర్ణాః=బంగారముయొక్క కాంతివంటికాంతి గలిగినట్టియు, శుచయః=పరిశుద్ధములగునట్టియు, పావకాః=పవిత్రముచేయునట్టియు, ఆపః=ఉదకములు, ప్రచక్రముః=ప్రవహించుచున్నవి, అపద్యం=పాపమును, హిత్వా=పోగొట్టి ఆసుహి= ఈ యుదకములయందు, పవిత్రాః = పవిత్రములగునట్టియు, వితతాః=వ్యాపించినట్టియు, శతం=నూఱులకొలది, యనఁగా ననేకమైన తీర్థములు (నద్యాద్యుదకములు) (సంతి) ఉన్నవి, (హేవధు)=ఓ చిన్నదానా సవితా=ప్రేరకుఁడైన దేవః=పరమేశ్వరుఁడు తాభిః= ఆ (ఉదకములచేతను) త్వా=నిన్నును, పునాతు=పవిత్రురాలను జేయుంగాక.

తా॥ పవిత్రములగు ననేక తీర్థములుగల యీ యుదకములు, ఓచిన్నదానా, దేవుఁడు నీపాపమును బోగొట్టి నిన్నును బవిత్రురాలను జేయుంగాక.

---

ఈ మంత్రము మొదలు అయిదు మంత్రములు తైత్తిరీయ్య సంహితయొక్క కాం ౫ ప్ర ౬ అ ౧ ప ౧౨లో పదభేదముగాను, స్వరవ్యుత్క్రమముగాను ఉనవి.

మూ॥ హిరణ్యవర్ణా శ్శుచయః పావకా యాసుజాతః కశ్య పోయా స్వగ్నిః యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తా స్తఆపశ్శగ్గ్ స్యోనా భవంతు ॥౧॥

పద॥ హిరణ్యవర్ణాః। శుచయం॥ పావకాః! యాసు జాతః! కశ్యపః। యాసు। అగ్నిః॥ యాః ॥ అగ్నిం ॥ గర్భం॥ దధిరె॥ సుఽవర్ణాః। తాః। తే ॥ ఆపః ॥ శం ॥ స్యోనా భవంతు ॥౨॥

టీక॥ యాసు=ఏయుదకములయందు, ౧. కశ్యపః = సూర్యుఁడు, జాతః=పుట్టెనో, యాసు=ఏయుదకములయందు, అగ్నిః=అగ్ని, జాతః=పుట్టెనో, యాః=ఏయుదకములు, అగ్నిం=బడబాగ్నిని, ౨. గర్భం=గర్భమందు, దధిరే–ధరించినవో, హిరణ్యవర్ణాః బంగారముయొక్క కాంతిగలిగినట్టియు, శుచయః=పరిశుద్ధములగునట్టియు, పావకాః=పవిత్రముచేయునట్టియు, సువర్ణాః=యోగ్యమైన కాంతిగలిగినట్టియు, తాః=ఆ, ఆపః=ఉదకములు, (హేవధు)=ఓ చిన్నదానా, తే=నీకు, శం=(ఇహలోకమందు) సౌఖ్యమును జేయునవియును, స్యోనా =(పరలోకమందు) సౌఖ్యమును జేయునవియును, భవంతు=అగుఁగాక.

తా॥ అత్యంత పవిత్రులగు సూర్యాగ్నులను పుట్టించినట్టియు, తమయందు

బడబాగ్నిని ధరించినట్టియు, ఈ యుదకములు ఓ చిన్నదానా నీకు ఇహపరసౌఖ్యములను గలుగజేయుగాక.

---

౨॥ ౧౨॥ తై - సం - కాం ౫ - ప్ర॥ ౭ అ ౧ ప ౨ - (౧) పశ్యతిసర్వమితి పశః = సర్వమును జూచువాడు, పశ్య ఏవ పశ్యకః = స్వార్థమందు కప్రత్యయము. ప్రశ్యకశబ్దమునకు ఆద్యంతవర్ణములయొక్క వ్యత్యయముచేత కశ్యపః అను రూపము కలిగిన సర్వవ్యాపారములనుచూచే సూర్యుడని యర్థము.

మూ॥ యాసాగ్ రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం యాఅగ్నింగర్భం దధిరే సువర్ణాస్తా స్త ఆపశ్శగ్గ్ స్యోనా భవంతు ॥3॥

పదవి॥ యాసాం । రాజా । వరుణః । యాతి । మధ్యే । సత్యానృతేఇతిసత్యే-అనృతే । అవ-పశ్యన్ । జనానాం । యాః ॥ అగ్నిం । గర్భం । దధీరే సు-వర్ణాః । తే ఆపః శం । స్యోనాః । భవంతు

మూ॥ యాసాం దేవా దివి కృణ్వంతి భక్షం యా అంతరిక్షే బహుధాని నివిష్టాః యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాః స్తా స్త ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు ॥౪॥

టీక॥ వరుణః=వరుణుడు, యాసాం=యేయుదకమయిన, రాజా=ప్రభువగుచు, జనానాం= జనులయొక్క, సత్యానృతే = నిజానిజములను, అవపశ్యన్ = చూచుచునవాడగును, అనగా తెలిసినవా డగుచు, మధ్యే = మధ్యలోకమందు, యాతి = సంచరించు చున్నాడో, తాః = ఆ పః = ఉదకములు (హేవధు) = ఓ చిన్నదానా, తే=నీకు, స్యోనాః, సుఖకరములు, భవంతు=ఖగుగాక ॥3॥

తా॥ మధ్యలోకమందలి జనులయొక్క నిజానిజములను గని పెట్టుచున్న వరుణుడు అధిష్టానదేవతగా గలయుదకములు ఓ చిన్నదానా నీకు సుఖకరములగు గాక ॥3॥

---

ఇందుకు ప్రమాణము, తైత్తిరియ్యారణ్యకము. ౧ ప్రపాఠకము. ౧ అ ౮ ప ౮ లో "కశ్యపః" పశ్యకో భవతి ॥ యత్సర్వం పరిపశ్య తీతి సౌక్ష్మ్యాత్ ॥

౨ సప్తమ్యర్థమందు ద్వితీయావిభక్త్యే కవచన ప్రత్యయము.

3 ఈ మంత్రముయొక్క పూర్వార్థము ఋగ్వేదము మండలము 8 సూక్తము। ౪౯ ఋక్కు 3 లో నున్నది. తై-సం-కాం౫ప్ర౬అ౧-ప౪

ప॥ యాసాం । దేవాః । దివి । కృణ్వంతి । భక్షం యాః । అంతరిక్షే బహుౘధా । నిౘష్టాః । యాః ॥ అగ్నిం ॥ గర్భం ॥ దధిరే ॥ సుౘవర్ణాః ॥ తాః । తే । ఆపః ॥ శం । స్యోనాః । భవంతు ॥౪॥

మూ॥ శివేన త్వా చక్షుషా పశ్యం త్వాప శ్శివయా తనో్వ పస్పృశంతు త్వచం తేః ఘృతశ్చుత శ్శుచయోయాః పావకా స్తా స్త ఆపశ్శగ్గ్ స్యోనా భవంతు ॥౫॥

పదవి॥ శివేన । త్వా । చక్షుషా ॥ పశ్యంతు । ఆపః ॥ శివయా । తన్వా ॥ ఉప స్పృశంతు । త్వచం । తే ఘృతశ్చుౘతః ॥ శుచయః ॥ యాః ॥ పావకాః ॥ తాః ॥ తే ॥ ఆపః ॥ శం ॥ స్యోనాః ॥ భవంతు ॥

టీక॥ యాసాం=ఏయుదకములయొక్క, భక్ష=భక్షణమును, దివి=అంతరిక్ష లోకమునందు, దేవాః=దేవతలు, కృణ్వంతి=చేయుచున్నారో, యాః=ఏయుదకములు, అంతరిక్షే=ఆకాశమునందు, అనగా మేఘములయందు, బహువిధా=అనేక ప్రకారములుగాను, నివిష్టాః=ఉన్నవో, తాః=ఆ, ఆపః=ఉదకములు, (హేవధు)=ఓచిన్నదానా. తే=నీకు, స్యోనాః=సుఖకరములు. భవంతు=అగుగాక. తాత్ప ర్యము స్పష్టము ॥౪॥

5 మం॥ టీక। ఘృతశ్చుతః=నేతివంటిరసమును ప్రవించుచున్నట్టియు, శుచయః=పరిశుద్ధములగునట్టియు, పావకాః=పవిత్రముచేయునట్టియు, యాః=ఏ ఆపః=ఉదకములు. (సంతి)=ఉన్నవో, తాః=ఆపః=ఉదకములు. హేవధు=ఓచిన్నదానా త్వాం=నిన్ను, శివేన=మంగళమయిన, చక్షుషా=దృష్టిచేతను.

---

తై-సం-కాం-౫-ప్ర౬-అ౧-ప-౧

మూ॥ పరి త్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతః వృద్ధా యు మనువృద్ధయో జుష్టాభవంతు జుష్టయః ॥౬॥

ప॥ పరి ॥ త్వా ॥ గిర్వణః ॥ గిరః ॥ ఇమాః ॥ భవంతు ॥ విశ్వతః వృద్ధౘఆయుం అను ॥ వృద్ధయః ॥ జుష్టాః ॥ భవంతు ॥ జుష్టయః ॥౬॥

పశ్యంతు=చూచుగాక, శివయా=మంగళమయిన, తన్వా=(తమ) శరీరము చేతను, తే=నీయొక్క, త్వచం=శరీరమును, ఉపస్పృశంతు=స్పృశించుగాక, తే=నీకు, స్యోనాః=సుఖకరములు, భవంతు=అగుగాక, తాత్పర్యము స్పష్టము ॥౫॥

౬ మం అ॥ ౧. హేగిర్వణః = స్తుతివాక్యములచేతను, సేవింపదగిన యో ఇందుద్రా (భగవంతుడా) త్వా=నిన్ను, ఇమాః=ఈ నా సంబంధమయిన గిరః=స్తుతి వాక్యములు, విశ్వతః అంతటను, పరి+భవంతు = ఆవరించుగాక, వృధాయుః = దీర్ఘాయుర్దాయముగల, త్వా=నిన్ను. అను= అనుసరించి, వృద్ధయః= వృద్ధిగలవి, భవంతు=అగుగాక. జుష్టయః=(నాయొక్క) సేవలు జుష్టాః=(నీకు) ప్రియములైనవి భవంతు=అగుగాక ॥౬॥

తా॥ ఈమంత్రముచేతను వరుఁడు పెళ్ళికూతురుని మధుపర్కవస్త్రముచేతను గప్పవలసినదని ఆపస్తంబులవారు చెప్పిరి, సుతివాక్యము లెట్లు ఇంద్రుని నంతటను ఆవరించునో యట్లే వస్త్రము పెళ్ళికూతురిని ఆవరించునని యభిప్రాయమును హరదత్తాచార్యుఁడు వ్రాసినాడు. ఈ మంత్రము ఋగ్వేదముయొక్క మం అ సూ౧౦ ఋక్కు ౧౨ గాను తైత్తిరియ సంహితయొక్క కాం ౧ ప్ర ౩ అ ౧ ప ౨లో యజుస్సుగాను ఉన్నది. ఈమంత్రముయొక్క అర్థము వ్యాఖ్యానములలోను భేదముగా నుండుటవలన ఆ భేదము లిచ్చట వివరింపబడును.

హరదత్తునిచే వ్రాయఁబడినయర్థము.

హే ఇంద్ర త్వం గిర్వణః వర్ణసంజ్ఞిక స్తుతిలక్షణాభి ర్గిర్భి స్సంభజనియ్యః, స్తుతీనాం సంభక్తిః, ఇమా, మదియ్యా, గిరః త్వా, త్వాం. పరిభవంతు (పరిపూర్ణో భవతిః, పరిగ్రహే, వర్తతే) పరిగృహ్ణంతు, విశ్వతః సర్వతః,యథేమా మిదంవాసః పరితో భవ తీత్యభిప్రాయః। కీదృశం త్వాం, వృద్ధాయుం, వృద్ధా, స్తరూన్ప్రతి గంతారం కిదృశ్యో గిరః. అనువృద్ధయః, అను రసర్థకః, ప్రవృద్ధాః. తాశ్చజుష్టా స్సేవితా భవంతు త్వయా జుష్టయ స్సేవితవ్యా॥ శ్రీవిద్యారణ్యులవారిచే యజుర్వేదము నందు వ్రాయబడినయర్థము। కల్పః అథైనా పరిశ్రయంతి పరిత్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతో వృద్ధాయు మనువృధయో జు భవంతు జుష్టయః ఇతి గీర్భిస్తుతిభి ర్వననియో భజనీయ ఇంద్ర స్సదోభిమానీ గిర్వణః హే గిర్వణ ఇమాః స్తోత్రశస్త్రరూపాః గిరఃసర్వతః కటరూపేణ త్వాం పరిభవంతు వేష్టయంతు కీదృశ్యః దీర్ఘాయుషం త్వా మను స్వయమపి వృద్ధిమత్యః కించ జుష్టయః అస్మత్సే

వాఃతన జుష్టాః ప్రియాః భవంతు మంత్రస్య స్పష్టార్థతాం దర్శయతి పరిత్వా గిర్వణో గిర ఇత్యాహ యథా యజుశ్శైవైతత్ సం ౯ కాం ౨ ప్ర ౧౦-అను.

శ్రీ దయానంద సరస్వతీస్వాములవారిచే జేయఁబడిన ఋగ్వేదభాష్యమందు వ్రాయఁబడిన యర్థము.

పదార్థః ॥ పరి-పరితః ।పరీతి సర్వతో భావంప్రాహ॥ నిరు ౧-౩ త్వా త్వాం స్తవ తస్తుతిభాజన మింద్ర ద మీశ్వరం । గిర్వణః-గీర్భి ర్వేదానాం, విదుషాంచ వాణీభి ర్వన్యతేసంసేవ్యతే య స్తత్సంబుద్ధౌ ॥ గిరః-స్తుతయః ॥ ఇమాః వేదస్థాః ప్రత్యక్షావిద్వత్ప్రయుక్తాః॥ భవంతు॥ విశ్వతః-విశ్వస్యమధ్యే వృద్ధాయుం ఆత్మనో వృద్ధమిచ్ఛతీతి తం అను-క్రియార్థే । వృద్ధయః-వర్ధ్యంతే యాస్తాః ॥ జుష్టాః యాః ప్రీణంతి సేవంతేతాః॥ భవంతు జుష్టయః-జుష్యంతే యాస్తాః॥

అన్వయః॥ హే గిర్వణ ఇంద్రవిశ్వతో యా ఇమా గిర స్సంతి తాః పరిసర్వత స్త్వాం భవంతు। తథా చెమా వృద్ధయో జుష్టయో జుష్టా వృద్ధాయుం " వ మను భవంతు॥

భావార్థః ॥ హే భగవన్ యా యోత్సృష్టా ప్రశంసా సా త వై వాఽస్త యా యా సుఖానందవృద్ధిశ్చ సా సా త్వా మేవ సంసేవతే । య ఏవ మీశ్వరశ్య గుణాన్ తత్సృష్టిగుణాం శ్చాఽనుభవంతి త ఏవ ప్రసన్నా విద్యావృద్ధా భూత్వా విశ్వస్మిన్ పూజ్యా జాయంతే । అత్ర సాయణాఽచార్యేణ పరిభవంతు సర్వతః (ప్రాప్నువం త్వి త్యశుద్ధ ముక్తం । కుతః పరా భువోఽవజ్ఞాన ఇతి పరిపూర్వకస । భూదాతో స్తిరస్కారార్థే నిపాతిరిత్వాత్॥

మ॥ ౭॥ ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూం అగ్నేరనువ్రతాభూత్వా సన్నహ్యే సుకృతాయ కం ॥౭॥

పదవి॥ ఆఽశాసానా । సౌమనసం । ప్రఽజాం । సౌభాగ్యం । తనూం అగ్నేః । అనుఽవ్రతా । భూత్వా । సంనహ్యే । సుఽకృతాకం ॥

పూషా త్వేతో నయతు హస్తగృహ్యా శ్వినా త్వా ప్రవహతాగ్ం రథేన గృహా న్గచ్ఛ గృహపత్నీ యథా సో వశినీ త్వం విదథ మావదాసి ॥౮॥

టీక॥ (వధూః) పెండ్లికుమార్తె, సౌమనసం=మంచిమనస్సును, ప్రజాః=సం

తానమును, సౌభాగ్యం=సువాసినీత్వమును, తనూం(మంచి)దేహమును, ఆశాసానా= కోరుచున్నదగుచు, అగ్నేః=అగ్నికి లేక భగవంతునికి, అనువ్రతా=అనుసరించి వ్రతము చేయుచున్నది,భూత్వా=అయి, (ప్రతిష్ఠతి ఉండుచున్నది,) సుకృతాయ= వివాహమనెడి పుణ్యకర్మకొరకు, యోక్త్రేణ=త్రాటిచేతను, సన్నహ్యే=కట్టు చున్నాను, కం=నిరర్థకము.॥౭॥

తా॥ ఈ పెళ్ళికుమార్తె మంచిమనసును సంతానయును, సువాసినీత్వమును మంచిదేహమును, గోరి వ్రతములను జేయుచున్నది. వివాహమనెడు పుణ్యకర్మకొరకీ చిన్నదానికి నడుమునందు దర్భత్రాటిని గట్టుచున్నాను.

---

వా॥ ౧. గిరా వన్యతే ఇతి గిర్వణాః స్తుతివాక్యములచేత సేవింపఁబడు వాఁడు. తస్య సంబుద్ధిః - హేగిర్వణః గిర్ అను శబ్దము ఉపపదముగల "వన సంభక్తౌ" అను ధాతువుకంటె కర్మార్థమందు అసున్ ప్రత్యయము ఈ పదము సకారాంతము. పృషోదరాది గణములోని దగుటవలన ఉపపద మయినగిర్ అను శబ్దమునకు దీర్ఘము గాలేదు. ౨. పరి అను ఉపసర్గ పూర్వము గాగల భవంతు అను పదమునకు ఇచ్చట ఆవరించుట యర్థము॥౬॥

ఈ మంత్రము తైత్తిరియ్య సంహితయొక్క కాం ౧ ప్ర ౧ అ ౧౦ ప ౧లో బుక్కుగానున్నది.

౮ మ॥ ప॥ పూషా । త్వా । ఇతః । నయతు । హస్తఽగృహ్య । అశ్వినా । త్వా । ప్ర । వహతాం । రథేన । గృహాన్ । గచ్ఛ । గృహఽపత్నీ । యథా అసః । వశినీ । త్వం ! విఽదథం ॥ ఆవదాసి ॥౮॥

టీక॥ (హేవధు)=ఓచిన్నదానా, త్వా=నిన్ను, పూషా=సూర్యుఁడు, లేక పోషకుఁడగు భగవంతుఁడు, హస్తగృహ్య=హస్తమును బట్టుకొని, ఇతః=ఇక్కడ నుంచి, నయతు= (అగ్నిసమీపమును) పొందించుఁగాక, అశ్వినా=అశ్వినీదేవతలు, త్వా=నిన్ను, రథేన=రథము చేతను, (ప్రవహతాం=నడపించెదరుగాక,గృహపత్నీ= గృహయజమానిని, యథా=ఏ ప్రకారముగాను, అసః=అగుదువో, తథా=ఆప్రకా రముగాను, గృహాన్ = (నా సంబంధమయిన) గృహములను, గచ్ఛ = పొందుము, త్వ=నీవు, వశినీ=(గృహజనులయొక్క) స్వాధీనముగలదానవగుచు, విదథం=గృహ కార్యములను, ఆవదాసి=చెప్పుము॥౮॥

తా॥ ఓచిన్నదానా సూర్యుఁడను అశ్వినీదేవతలును రథముచే నిన్ను నా

గృహమును బొందించెదరుగాక. నీవు నా గృహమునకు యజమానురాలవై గృహకార్యములను బాగుగ నెరవేర్పుము. ఈ మంత్రము ఋగ్వేదముయొక్క మం ౧౦ సూ ౮౫ ఋక్కు ౨౬ గా నున్నది. ఈ మంత్రముచేతను పెండ్లి కొమార్తెను భర్తృగృహప్రయాణమునిమిత్తము రథము నెక్కింపవలసినదని ఆశ్వలాయనగృహ్యసూత్రమందు వినియోగము చెప్పబడినది. "పూషా త్వేతో నయతు హస్త గృహ్యేతి యాన మారోహయేత్" ఆశ్వలాయనగృహ్యసూత్రము ౧-౭

పెండ్లికొమార్తెను అగ్నిసమీపమును బొందింపవలసిన దని ఆపస్తంబులవారిచే వినియోగము చెప్పఁబడినది. ఆ థైనాముత్తరయా దక్షిణహస్తే గృహీ త్వాగ్నిమభ్యానియ" ఆప-గృ-ప్ర ౧-ఖం ౪.

ద్వితీయ ఖండము సమాప్తము.

—♦ ప్రథమ మంత్ర ప్రశ్నః ♦—

మూ॥ సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః తృతీయో అగ్నిష్టే పతి స్తురీయస్తే మనుష్యజాః

పద॥ సోమః। ప్రథమః। వివిదే। గంధర్వః। వివిదే। ఉత్తరః। తృతీయః। అగ్నిః। తే। పతిః। తురీయః। తే। మనుష్యజాః॥

టీక॥ సోమః=చంద్రుఁడు, ప్రథమః=మొదటిపెనిమిటియయి, త్వాం=నిన్ను విదే=పొందెను, గంధర్వః=విశ్వావసుఁడనుగంధర్వుడు ఉత్తరః=వానికర్వాతి పెనిమిటియై త్వాం=నిన్ను, వివిదే=పొందెను అగ్నిః=అగ్నిహోత్రుడు, తే=నీకు తృతీయః=మూడవవాడైన, పతిః=పెనిమిటి, మనుష్యజాః= మనుష్యునివలనబుట్టిన, అహం=నేను, తే=నీకు, తురీయః=నాల్గవవాడనైన, పతిః=పెనిమిటిని॥

తా॥ ఓ చిన్నదానా! చంద్రుఁడు నిన్ను ముందుగా వరియించెను. అటు పిమ్మట విశ్వావసుఁడను గంధర్వుడు నిన్ను వరియించెను. వారిద్దఱి యనంతరమగ్నిహోత్రుఁడు వరియించినందున మూఁడవ పెనిమిటి యాయెను. ఆదేవతలు పొందిన పిమ్మట మనుష్యజాతియందుఁ బుట్టిన నేనుపొందినవాఁడనవుటచే నాల్గవ పెనిమిటి నయ్యెదను.

మూ॥ సోమోఽదద ద్గంధర్వాయ గంధ ర్వోఽదద దగ్నయే రయిం చపుత్రాగ్ శ్చాదాదగ్నిర్మహ్య మథో ఇమాం॥

పదవి॥ సోమః ॥ అదదత్ । గంధర్వాయ । గంధర్వః । అదదత్ । అగ్నయే । రయిం । చ । పుత్రాన్ । చ । అదాత్ । అగ్నిః । మహ్యం । అథః । ఇమాం॥

టీక॥ సోమః=చంద్రుఁడు, త్వాం=నిన్ను, గంధర్వాయ=గంధర్వునికొరకు అదదత్=ఇచ్చెను, గంధర్వః=గంధర్వుఁడు, అగ్నయే=అగ్నిహోతృనికొరకు, అదదత్=ఇచ్చెను, అథః=అనంతరమందు, అగ్నిః=అగ్నిహోత్రుడు, మహ్యం=నాకొరకు, రయించ=ధనమును, పుత్రాంచ=తనయులను, ఇమాం=ఈచిన్నదానవైన నిన్నును, అదాత్=ఇచ్చెను.

తా॥ చంద్రుఁడు ముందుగా ఈ చిన్నదానిని పొంది విశ్వావసుః డను గంధర్వున కిచ్చెను. ఆ గంధర్వుఁడు అగ్నిహోత్రున కిచ్చెను. ఆ యగ్నిహోతృఁడీ చిన్నదానిని నాకొర కిచ్చి దీనియందు సంతానము కలుగునట్లుగాను, మాకు భాగ్యము గల్గునట్లుగా ననుగ్రహించెను

మూ॥ గృభ్ణామి తే సుప్రజాస్త్వాయ హ స్తం మయాపత్యాజరదష్టి ర్యథాసః భగో అర్యమా సవితా పురంధి ర్మహ్యం త్వా దుర్గార్హపత్యాయ దేవాః॥

పదవి॥ గభ్ణామి । తే । సుప్రజాస్త్వాయ । హస్తం । మయా । పత్యా । జరదష్టిః యథా । అసః । భగః । అర్యమా । సవితా । పురంధిః । మహ్యం । త్వా । అదుః । గార్హపత్యాయ । దేవాః॥

టీక॥ పత్యా= పెనిమిటినైన, మయా=నాతోఁగూడ, యథా=ఏప్రకారముగా జరదష్టిః=ముసలితనమును, అసః=పొందెదవో, తథా=ఆ ప్రకారముగాను, సుప్రజాస్త్వాయ=యోగ్యమైనసంతానము కలుగుటకొరకు, తే=నీయొక్క, హస్తం=హస్తమును, గృభ్ణామి=పట్టుకొనుచున్నాను, పురంధిః=విశేషమైనజ్ఞానముగల అర్యమా=అర్యముఁడు, భగః=భగుఁడు, సవితా=సవితృఁడు అనుపేర్లుగల దేవాః=దేవతలు, గార్హపత్యాయ= గృహస్థాశ్రమముకొరకు, త్వాం=నిన్ను, మహ్యం= నాకొరకు అదుః=ఇచ్చిరి.

తా॥ ఓ చిన్నదానా నన్ను వివాహము చేసుకొని నే నెంతపర్యంతము వార్ధక్యదశను బొందియుండెదనో అంతపర్యంతము జీవించియుండుము. యోగ్యమైన సంతానమును బొందుటకు నిన్ను (పాణిగ్రహణము)ను జేసికొను చున్నాను. విశే

మైన జ్ఞానముగలవారును దేవతలును ద్వాదశాదిత్యులలో నన్యతములు నగు భగుడును అర్యముడు, సవితృడు, నేను గృహస్థాశ్రమమును బొందుటకు నిన్ను నాకిచ్చు నట్లు ప్రేరేపణజేసిరి

మూ॥ తే హ పూర్వేజనాసో యత్ర పూర్వ వహో హితాః మూర్ధన్వాన్ యత్రసౌభ్రవ దేవేభ్య ఆతపతు॥

పదవి॥ తే । హ । పూర్వే । జనాస, । యత్ర । పూర్వవహః । హితాః । మూర్ధ । న్వాన్ । యత్ర ! సౌభ్రవః । పూర్వ । దేవేభ్యః ॥ ఆతపతు॥

టీక॥ తేహ=ఆపూర్వోక్తమైన భగుడు మొదలగువారును పూర్వవహః=వివాహమునకు బూర్వమందుగ ర్తలై నవారును, పూర్వేజనాసః= పూర్వు లైన తండ్రి మొదలగు మనుష్యులును= యత్ర, ఏ గార్హపత్య విషమై, హితాః=ప్రయత్నము కలవారై యుండిరో మూర్ధ్వాన్=ప్రధానుడైనవాడును, దేవేభ్యః =దేవతలకంటె పూర్వః, మొదటివాడును=భసౌ్రవః, అదితి కుమారుడు నగు అగ్ని హోత్రుడు, యత్ర=ఏ గార్హపత్య వేదికయందు=ఆతపతు, అంతట బ్రకాశించుచుండునో॥

తా॥ ఏ గృహస్థాశ్రమము విషయమై చిన్నదానియొక్క తండ్రులు మొదలగువారును భగుడు మొదలగు దేవతలును ప్రయత్నము జేయుచుండిరో దేవతలకంటె మొదటివాడును, ప్రధానుడును, అదితి కుమారుడు నగు అగ్నిహోత్రుడు ఏ వివాహవేదిక యందు బ్రకాశించుచుండునో యటువంటి గార్హపత్యాశ్రమమును గురించి భగుడు మొదలగు దేవతలు నిన్ను నాకొరకిచ్చుచున్నారు. గాన నీహస్తమును గ్రహించు చున్నానని పూర్వముతో నన్వయము.

మూ॥ సరస్వతి ప్రేద మవ సుభగే వాజినీపతి తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామ స్యగ్రతః॥

పదవి॥ సరస్వతి । ప్ర । ఇదం । అవ । సుభగే । వాజినీవతి । తాం । త్వా । విశ్వస్య । భూతస్య । ప్ర గాయామసి అగ్రతః॥

టీక॥ సుభగే=ఓ సౌభాగ్యవంతురాలా వాపినీవతి=స్తోత్రములు, కలదానా సరస్వతి=సరస్వతీదేవీ! ఇదం=ఈపాణిగ్రహమును, ప్రావ=మిక్కిలిరక్షింపుము తాం=ఆపూర్వోక్తమయిన త్వాం=నిన్ను, విశ్వస్య=సమస్తమయిన, భూతస్య= జంతువులలో,అగ్రతః=ముందుగా, ప్రగాయామసి= స్తోత్రమును జేయుచున్నాముః

తా॥ భాగ్యవంతురాలవును, స్తుతింపఁబడుదానవునగు నో సరస్వతీ! ఈ వివాహమును మిక్కిలి రక్షింపుము: సమస్త భూతములలో నిన్నుముందుగా స్తోత్రమును జేయుచున్నాము.

మూ॥ య ఏతి ప్రదిశ స్సర్వా ది శోఽను పవమానః హిరణ్య హస్తా ఐరమ్మ స్స త్వా మన్మనసం కృణోతు॥

పదవి॥ యః । ఏతి । ప్రదిశః । సర్వా । దిశః । అను । పవమానః । హిరణ్య । హస్తః । ఐరమ్మః । సః । త్వా । మన్మనసం । కృణోతు॥

టీక॥ హిరణ్యహస్తః = భక్తులకు నిచ్చునట్టి బంగారము హస్తమందుఁ గలవాఁడును. ఐరమ్మః=అన్నమును గలిగింపజేయు నగ్నిహోత్రునికి మిత్రుఁడునగు, యః = ఏ, పవమానః=వాయువు, సరాః=సమస్తమైన,దిశః=దిక్కులను, ప్రదిశః= విదిక్కులను, అను = క్రమముగా, ఏతి = వ్యాపించుచున్నాడో, సః=అటువంటి వాయువు, త్వాం=నిన్ను, మన్మనసం=నాయందు, మనస్సుగలదానిగా కృణోతు= చేయుఁగాక॥

తా॥ ఏ వాయువు భక్తులకు నిచ్చుకొరకు బంగారము హస్తమందుఁ గలవాఁడై తూర్పు మొదలగు దిక్కులయందు వ్యాపించి సంచరించు చున్నాడో, యన్నప్రదుఁడగు నట్టి యగ్నిహోత్రునకు స్నేహింతుండగు వాయువు నిన్ను నా యందెల్లప్పుడు ప్రేమగలదానిగా జేయుఁగాక॥

మూ॥ ఏక మిషే విష్ణు స్త్వా న్వేతు । ద్వే ఊర్జే విష్ణు స్త్వా న్వేతు । త్రీణి వ్రతాయి విష్ణు స్త్వాన్వేతు । చత్వారి మాయోభ వాయ విష్ణు స్త్వానేతు పంచ పశుభ్యో విష్ణు స్త్వాన్వేతు । షడృతుభ్యో విష్ణు స్త్వాన్వేతు । స ప్త స ప్తభ్యో హోత్రాభ్యో విష్ణు స్త్వాన్వేతు॥

పదవి॥ ఏకం । ఇషే । విష్ణు । త్వా । అను । ఏతు । ద్వే । ఊర్జే । విష్ణుః । త్వా అను । ఏతు । తీ ణీ । వ్రతాయ । విష్ణుః । త్వా । అను । ఏతు చత్వారి । మయోభ వాయ । విష్ణుః । త్వా । అను । అను । ఏతు । పంచ। పశుభ్యః। విష్ణుః । త్వా । అను ఏతు । షట్ ఋతుభ్యః । విష్ణుః । త్వా । అను । ఏతు । సప్తభ్యః । హోత్రాభ్యః విష్ణుః । త్వా । అను । యేతు॥

టీక॥ యేకం=ఒక యడుగున, ఇషే=అన్న సమృద్ధికలుగుటకొరకు, త్వా=

నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు=అనుసరించి, నడచుగాక, ఊర్జే=బలముకలుగుటకొరకు ద్వే=రెండడుగులను, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి; అన్వేతు=అనుసరించి నడచుఁగాక వ్రతాయ=కర్మముకొరకు, త్రీణి=మూడడుగులు, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు=అనుసరించి, నడచుగాక, మయోభవాయ=కర్మసంబంధమయిన సుఖముకొరకు, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి. అన్వేతు=అనుసరించి నడచుగాక, పశుభ్యః = పశుసమృద్ధికొరకు, పంచ = అయిదడుగులు, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు=అనుసరించి నడచుగాక ఋతుభ్యః=ఋతుసంపత్తుల కొరకు, షట్=ఆరడుగులను. విష్ణుః=విష్ణుమూర్తి, త్వా=నిన్ను, అన్వేతు=అనుసరించి నడచుగాక, సప్తభ్యః=యేడుగురైన, హోత్రాభ్యః=హోతలకొరకు, త్వా=నిన్ను, సప్త= యేడడుగులను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు=అనుసరించి నడచుగాక.

తా॥ ఓ చిన్నదానా ! నీవు నన్ననుసరించి నడువుము, విష్ణుమూర్తి నీవు నడచు మొదటియడుగువలన అన్నమును, రెండవయడుగువలన బలమును, మూడవయడుగువలని కర్మమును, నాలుగవయడుగువలన కర్మసుఖమును, అయిదవయడుగువలన పశుసమృద్ధిని, ఆరవయడుగువలన ఋతుసంపత్తును, యేడవయడుగువలన యజ్ఞమును జేయించుటకు హోత, ప్రశాస్త, బ్రాహ్మణాచ్ఛంసి పోత, నేష్ట, అచ్ఛావాక, అగ్నీధ్రు లను నేడుగురు ఋత్విక్కులను గలుగ జేయుఁగాక॥

మం॥ సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా బభూవ సఖ్యం తేగమేయగ్ం సఖ్యాత్తే మా యోషగ్ం సఖ్యాన్మే మా యోష్ఠాః సమయావ సంకల్పావహై సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ॥ ఇష మూర్జ మభిసంవసానౌ సం నౌ మనాగ్ంసి సం వ్రతా సము చిత్తాన్యాకరం సా త్వ మస్యమూహ మమూహ మస్మి సా త్వం ద్యౌరహంపృథివీ త్వగ్ం రేతోఽహగ్ం రేతో భృత్త్వం మనోఽహ మస్మి వాక్త్వగ్ం సామాఽహ మస్మ్యృక్త్వగ్ం సా మామనువ్రతా భవ పుగ్ంసే పుత్రాయ వేత్తవై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే॥

పదవి॥ సఖా । సప్తపదా । భవ । సఖాయౌ । సప్తపదా । బభూవ । సఖ్యం

